

బాల ప్రపంచంలో ఎల్లప్పుడూ

వినిపించే మాట న్యూట్రీన్




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెని

ప్రైవేట్ లిమిటెడ్,

చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.




మీ కేశ పోషణ పథకము

నేటే ప్రారంభించండి





# నేడే చూడండి!





రాజలక్ష్మి ప్రొడక్షన్స్ వారి

# ఖైదీ కన్నయ్య

దర్శకుడు విఠలాచార్య

నిర్మాత డూండి

ఈస్టిండియా రిలీజ్

MOULIS

## తుషార్ వంటింట్లో వుంటే
## ఇంట్లో అంతా ఆరోగ్యమే

తన కుటుంబంలోనివారి ఆరోగ్యం వారు తినే ఆహారం పై ఎక్కువగా ఆధారపడుతుందని వివేకి అయిన ప్రతి తల్లికీ తెలుసు. వంట చేయుటకు పవిత్రమైన తుషార్ — ఎ, డి, విటమినులతో ప్రశస్తి కెక్కిన వనస్పతి అని కూడా ఆమెకు తెలుసు.



# తుషార్

ఎ, డి, విటమినులుగల వనస్పతి




తుంగభద్ర ఇండస్ట్రీస్ లి., కర్నూలు

ASP/T1.7




# చందమామ

సంపాదకుడు : 'చక్రపాణి'


రామాయణ కథ గురించి ప్రజలలో ఉండే అనేక రకాల అపోహలను తొలగించడానికి "చందమామ"లో వాల్మీకి రామాయణ కథను ఏమాత్రమూ మార్చకుండా ప్రచురిస్తున్నాము. ఈ విషయం అదివరకే స్పష్టం చేశాము. అయినప్పటికీ "రాముడు మాంసం తింటాడా?" "గుహుడు పడవ నడిపేవాడని చదివాము, అతను బోయరాజని ఎందుకు రాశారు?" "రాముడు సుమంత్రుణ్ణి అబద్ధ మాడమంటాడా?" ఇలాటి సంశయాలు పాఠకుల నుంచి వినవస్తున్నాయి. పాఠకులు ఇలాటి కుశంకలు మాని రామాయణం తాలూకు అసలు కథ "చందమామ" ద్వారా తెలుసుకుంటారుగాక!


సంపుటి : 30 ఏప్రిల్ 1962 : సంచిక 4



# భారత చరిత్ర



చంద్రగుప్తుడి కొడుకైన బిందుసారుడు క్రీ. పూ. 273 ప్రాంతంలో చనిపోయాడు. ఆయన చనిపోయిన నాలుగు సంవత్సరాల అనంతరం అశోకుడు పాటలీపుత్రంలో రాజ్యాభిషేకం చేసుకున్నాడు. బిందుసారుడికి అనేకమంది కూతుళ్ళూ, కొడుకులూ ఉండేవారు. రాజ్యాధికారం కోసం బిందుసారుడి కొడుకుల మధ్య ఘర్షణ జరిగినట్టు కనిపిస్తుంది. అశోకుడు తన సోదరులను అనేకమందిని చంపి సింహాసనం ఎక్కాడని ప్రతీతి. అతను బిందుసారుడి సింహాసనానికి అసలైన వారసుడు కాక పోవచ్చు. అశోకుడి పట్టాభిషేకం నాలుగేళ్ళు ఆలస్యంగా జరగటానికి కారణం అన్నదమ్ముల అంతః కలహమే కావచ్చు.

అశోకుడు "ప్రియదర్శి", "దేవానాం ప్రియ" అనే బిరుదులను తన పేరుతో చేర్చుకున్నాడు. అనేకమైన అశోక శాసనాలలో ఈ బిరుదులు కానవస్తాయి. రాజ్యానికి వచ్చిన తొలికాలంలో అశోకుడు తన పూర్వులలాగే కత్తి పట్టి ఏలాడు. ఆయన కళింగ రాజ్యంతో ఘోరమైన యుద్ధం చేసి దాన్నికూడా మగధ సామ్రాజ్యంలో చేర్చుకున్నాడు. ఈ విజయంతో మగధ సామ్రాజ్యం తమిళదేశం మినహా యావద్భారతాన్నీ ఆక్రమించింది; ఆఫ్ఘనిస్తానులో చాలా భాగం ఈ సామ్రాజ్యంలోకే వచ్చింది.

కళింగ యుద్ధం భారత చరిత్రగతిలోనే గాక ప్రపంచ చరిత్రగతిలో కూడా ఒక ప్రముఖ ఘట్టంగా పరిణమించింది. అది అశోకుడి జీవితాన్నే మరొక మార్గానికి తిప్పింది. కళింగ యుద్ధంలో జరిగిన రక్తపాతం కళ్ళారా చూసి అశోకుడి అంతరాత్మ మేల్కొన్నది. ఆయన పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. కత్తిని విడిచి ధర్మాన్ని

## 7. అశోకుడు

చేపట్టాడు. ఇక ప్రపంచంలో ధర్మ విజయాలు తప్ప అస్త్రవిజయాలు ఉండరాదని తీర్మానించుకున్నాడు. అటు పిమ్మట ఆయన అనుసరించిన వైదేశిక విధానంలో కూడా మార్పు వచ్చింది. తన రాజ్యంలో ధర్మఘోష తప్ప యుద్ధఘోష వినిపించరాదని అశోకుడు శాసించాడు.

బౌద్ధమతమూ, బుద్ధుడి బోధలూ అశోకుణ్ణి అమితంగా ఆకర్షించాయి. ఆయన వాటిని శ్రద్ధా సక్తులతో పఠించి అవలంబించాడు. బుద్ధగయకూ, కపిలవస్తు నగరానికీ యాత్రలు చేశాడు. ఆయన "ధర్మ యాత్రలు" చేస్తూ తన రాజ్యమంతా తిరిగి, సామాన్య ప్రజలకు "ధర్మం" బోధించాడు. ఒక్క బిగిన 256 రోజులు దేశయాత్ర చేసి, తన రాజ్యంలోనూ, పరిసర జంబూద్వీప ప్రాంతాలలోనూ ప్రజలు వెనకటి కన్న దేవత్వానికి దగ్గిర వచ్చారని తృప్తిపడ్డాడు.

ధర్మస్థాపన కోసమూ, ధర్మ వ్యాప్తి కోసమూ అశోకుడు చేసిన కృషి ఊహాతీతమైనది. ఇందుకుగాను ఆయన ప్రత్యేకంగా ఉద్యోగులను నియమించాడు. దేశమంతటా శిలాశాసనాలు వేయించాడు, ధర్మ స్తంభాలు ఏర్పాటు చేయించాడు. తన కొలువులో



"ధర్మ మహామాత్రులు" అనే ఉన్నతాధికారులను ఏర్పాటు చేశాడు.

రాజ్యంలో అరాజకాన్ని రేపే అటవికులూ, ఇతర జాతులవారూ ఉండేవారు. వారిని బలప్రయోగంతో అణిచే పద్ధతికి అశోకుడు స్వస్తి చెప్పాడు. ఆయన తన కొడుకులకు సహితం నైతిక విజయం యొక్క ప్రాశస్త్యం బోధించాడు. ధర్మ ప్రచారంలో ఆయనకు కారువాకి మొదలైన ఆయన పత్నులు కూడా తోడ్పడ్డారు.

బౌద్ధ ధర్మాన్ని ఇతర దేశాలలో ప్రచారం చెయ్యటానికి అశోకుడు ఇతర దేశాలకు ప్రచారకులను కూడా పంపాడు. ఈవిధంగా

బౌద్ధం సింహళానికి, బర్మాకూ, సుమత్రాకూ ఇతర ప్రాంతాలకూ వెళ్ళింది. యవన దేశాలకు కూడా అశోకుడు ప్రచారకులను పంపాడుగాని అక్కడ బౌద్ధం అంతగా పాదుకోలేదు.

అశోకుడు మిగిలిన కృషితోబాటు నిర్దుష్టమైన బౌద్ధ ధర్మాలను లిఖిత రూపంలో తయారు చేయించాడు. బుద్ధ సంఘాల సక్రమ నిర్వహణ గురించి కూడా ఆసక్తి చూపాడు. అశోకుడిలో విశేష మేమంటే ఆయన బౌద్ధ మతాభిమాని అయినప్పటికీ ఇతర మతాల పట్ల అసహనం చూపలేదు, ఇతరులను చూపనివ్వలేదు. బ్రాహ్మణులూ, జైనులూ, గోశాలమతం వారైన ఆజీవికులూ, తదితర మతాలవారూ తమతమ మతాలను స్వేచ్ఛగా అనుసరించగలిగారు.

తాను ఏదైతే బోధించాడో దాన్ని అశోకుడు అక్షరాలా ఆచరించాడు. జంతు వధను అదుపులో ఉంచాడు, బలులు నిషేధించాడు. మానవులతోబాటు పశువులకు కూడా చికిత్సా సౌకర్యాలు ఏర్పాటు చేశాడు. ప్రయాణీకుల సౌకర్యంకోసం రహదార్ల వెంబడి చెట్లూ, తోటలూ వేయించాడు.

అశోకుడి మరొక ప్రత్యేకత ఏమంటే ఆయన నిర్మించిన కట్టడాలు అత్యద్భుతమైనవి. ఆలయాలూ, విహారాలూ, స్మారక స్థూపాలూ మొదలైన వాటి వెంట అద్భుతమైన హర్మ్యాలు కట్టించాడు. ఆయన ప్రజలకు ఐక్యతా, సహనమూ, అహింసా బోధించాడు. ఆయన కృషితో గంగాతీరాన కొద్దిమంది మాత్రమే అవలంబించిన బౌద్ధ మతం విశ్వవ్యాప్తి పొందింది. భారత చరిత్రలో అశోకుడిలాటి అపూర్వ వ్యక్తిని మనం చూడం.

అశోకుడు 36 లేక 37 ఏళ్ళపాటు రాజ్యం చేసి 232 (క్రీ. పూ.) ప్రాంతంలో మరణించాడు. ఆయనతో మగధ సామ్రాజ్య వైభవం మాసిపోయింది.





# పార్వతీ కల్యాణము

చతుర్థాశ్వాసము.

రతి మన్మథుల గూడి ఋతురాజు వేంచేయ
శివ తపో వనమెల్ల శృంగార వనమాయె!
ప్రభు వసంతుని కంట బడినట్టి చెట్లెల్ల
శాఖాకు చిగురాకుగా మార్చి విలసిల్లె!

మొలకలిడి చివురులై,
మొగ్గలిడి పువ్వులై,
ఫలములిడి కన్నులకు
పండువైనది వనము!

చిలుకలును, కోయిలలు
చెలగి దిమ్మొనరింప,
మలయ మారుత మెలసి
మైమఱపుగావించె!

పొన్న కంటెను ముందు బూరుగు,
బూర్గు కంటెను ముందు మోదుగు,
పొన్న బూరుగు మోదుగులకును
మున్న పూచె అశోకతరువులు!

పొన్న చెట్టుల పైకి ప్రాకిన
పూసలిడు గురివెంద తీగలు
రతి పతికి ముత్యాల పందిరి
రచనలై విలసిల్లుచుండెను!

నేల పైనను, రాల పైనను
పూల పుప్పొడి కుప్పలాయెను,
ముళ్ళ కంపలు గూడ నా పు
ప్పొళ్ళ మాటున మునిగిపోయెను!

హాయిగా అరకండ్లు వెట్టిన
ఆడు లేడిని తనదు కొమ్మున
నల్ల చారల దుప్పి ప్రియమున
మెల్ల మెల్లగ గోకుచుండెను!

హంస హంసికి నోర నోరను
హర్షమున ఎలతూడు లిచ్చెను;
ఒక్క పువ్వున తేటి మిథునము
మక్కువగ విరితేనె గ్రోలెను!

ఉత్పల సత్యనారాయణాచార్య



అటులందున అలసి సొలసిన
అచ్చరను కింపురుషు డొక్కడు
గీత మాలాపించు నెపమున
చాతురిగ ముద్దాడుచుండెను!

తపమునకు కూర్చున్న సిద్ధుడు
తరుణి నొకతెను చూచి 'శివ శివ'
యనుచు కన్నులు మోడ్చి విచ్చుచు
ఆమె వెంబడి లేచి పోయెను!

శివ తపోవన మా వసంతుని
శిబిరమై మత్తిల్లియుండుట
కాంచి తన పని మిత్రుడే యొన
రించగలడని మరుడు తలచెను.

రమ్యమగు నొక పూల పందిట
రతిని నిల్పి రమా కుమారుడు
చెఱకు విల్లును, పూవుటమ్ములు
చేతగొని శివు చెంత కేగెను.

శివుడు కన్నులు మోడ్చి వ్యాఘ్రా
జినమునందున కూరుచుండెను;
శాంతరస మాకారమయి సా
క్షాత్కరించిన యట్టు లుండెను!

జడలపై తెగ గట్టి ఈశుడు
జపమునందు మునింగియుండెను;
రాతిపై వైరాగ్య మెల్లను
రాశి పోసిన యట్టు లుండెను!

అలలు లేని మహా సముద్రం
బట్లు నిశ్చలుడైన ఈశుని
కాంచి రతి పతి గుండె అదిరెను,
కరమునందలి విల్లు జారెను.

గుండె దిటవు మొనరించుకొని యా
కుసుమబాణుడు సైగ చేసెను;
చిలుకలును కోయిలలు మెల్లన
శివు లతాగారమున మ్రోసెను.

అపుడు నందీశ్వరుడు నోటికి
అడ్డముగ వ్రేలుంచి ఇష్షనె;
వెంటనే నిశ్శబ్దమయి వన
వీథి యంతయు మాటు మణిగెను!

పుష్పబాణుం డపుడు మెల్లగ
పొదల మాటుగ నేగి శివునికి



కొలది దూరమునందు నుండిన
గున్న మామిడి చెంత చేరెను.

శివుని పూజకు ఎన్ని పువ్వులు
కతగాని గిరిపుత్రి యప్పుడు
నడుమ నేర్చిన పూల తీవగ
నవ్వు మొగమున బయలుదేరెను.

నందికేశుని యాజ్ఞ గైకొని
నగతనూజ విలాస మొప్పగ
శివుని చెంతకు చేర, మారుడు
చెఱకు విల్లును ఎక్కుపెట్టెను.

మావి చిగురును ఉమకు గురి నిడి
మరుడు ఉన్మదనాస్త్రమేసెను;
ఆమె చెక్కిళ్లెఱ్ఱవడి హృద
యంబునం దనురాగ ముబ్బెను!

శివుని పాదములందు పార్వతి
సిగ్గుతో పువ్వులుంచి, మెల్లగ
చెవిని జేర్చిన పూవు జాఱగ
శిరము వంచి నమస్కరించెను.

హరుడు కన్నులు విచ్చి కనుగొని,
"అనన్యశుండగు మగని బడయుము
మగువ!" యని దీవింప – మునివుని
నగవుతో తల వంచె పార్వతి.

ఓహొ హొ! యని మరుడు తన స
మ్మోహనాస్త్రము వింట దొడిగెను;
హరుని యెద గురి చేసి చూచుచు
అదను కొఱకై వేచియుండెను.



అపుడు పార్వతి తాను తెచ్చిన
అక్షమాలను శివుని కిచ్చెను,
ఆదరమ్మున శివుడు దానిని
అందుకొనె మందస్మితమ్మున!

అదియె యదనని తమ్మి లప్పురన
మంటుకొన కనదాని విల్తుడు
పెదవి గఱచి మహాగ్రహంబున
వదలె శివునిపైన బాణము.

శివుడు ఉమ కెమ్మోవి చూచెను,
సిగ్గుతో ఉమ శిరము వంచెను,
చంద్రుడు పొడుపున పాలకడలిగ
శంభు మన ముప్పొంగి పొర్లెను!



శివుని చూపుల కామె రూపము
పసిడివెల్గుల ముగుద కనబడె;
ఒడలు పుల్కలుబారి, పూచిన
కడిమి మొలకై గిరిజ నిలబడె!

హరుని చూపులు గిరిజ సొగసను
సరసిలో బడి రాని వయ్యెను!
హైమవతి చిత్తరవు చూపులు
హరునియందే లగ్నమయ్యెను!

మరుడు తన చిగురాకు బాణము
ఒఱను బెట్టి, ధనుస్సు త్రిప్పుచు,
పార్వతీ పరమేశ్వరుల యను
భావముల పరికించుచుండెను.

అంత శివుడు తనదు చెష్టకు
వింతపడి నలుదెసలు చూచెను,
గున్న మామిడి క్రింద నిలబడి
యున్న మారుని పొడగాంచెను.

అవుర! యీ పని మన్మథునిదని
శివుడు చిచ్చుఱ కన్ను విచ్చెను,
మన్మథుం డొక తళుకు మెఱుపై
మండి యచ్చట బూదియయ్యెను!

అభయ మభయం బనుచు దేవత
లటకు వచ్చెడిలోన ఈశుడు
ఆ ప్రదేశము విడిచి పోయెను;
హైమవతి విభ్రాంతి నొందెను!

అంత రతి మన్మథుని కోసము
అదురు గుండెల పరుగు లెత్తుచు
వచ్చి, బూడిద కుప్ప గనుగొని,
రిచ్చపడి మూర్ఛిల్లె నచ్చట.

అంతలో హిమవంతు డచ్చట
కరుగుదెంచి, ఉమాకుమారిని
ఎత్తుకొని తన యింటి కేగెను—
ఈరెలుంగున అడవి మ్రోసెను! —(సశేషం)






## 10

[బిలమార్గాన్ని కప్పి వేసిన పొగలో చిక్కుకున్న బ్రహ్మదండి మాంత్రికుడు, తన శక్తుల్ని జపించి బయట పడేటందుకు ప్రయత్నించాడు. కాని, సాధ్యం కాలేదు. వాడు బిలంలో నుంచి బయటికి వచ్చి, రాజగురువుకు చిక్కిపోయాడు. ఆయన వాణ్ణి కర్రకు వేలాడ గట్టించి, నగరానికి తీసుకుపొమ్మని భటులకు ఆజ్ఞ ఇచ్చాడు. తరవాత—]

సేనానాయకుడు ముందుగా నగరంలోకి పంపిన సైనికుడు, తప్పెటలూ, తాషా మర్పాలూ వాయించే కొందరిని వెంటబెట్టుకుని, నగరంలో చాటింపు వేయించాడు.

చాటింపు వింటూనే జనం గుంపులు గుంపులుగా చేరి కేకలు పెడుతూ, జనం ఉత్సవాలు ప్రారంభించారు. చాలామంది బ్రహ్మదండి మాంత్రికుణ్ణి చూసేందుకు నగర ద్వారం దగ్గిరకు వెళ్ళారు. ముందుగా ద్వారం దాటి నగరం ప్రవేశించినవాడు రాజగురువు. ఆయన శక్తి సామర్థ్యాలవల్లనే మాంత్రికుడు పట్టుబడ్డాడన్న వార్త విన్న ప్రజలు ఆయనకు గొప్పగా స్వాగతం ఇచ్చారు. ఆయనకు చేతు లెత్తి అందరూ జేజేలు పలికారు.

కొద్దిసేపటి తరవాత సేనానాయకుడూ, అతనికి వెనకగా కావడి బద్దకు వేలాడుతున్న మాంత్రికుడితో సైనికులూ నగర ద్వారం సమీపించారు. మాంత్రికుణ్ణి ఈ స్థితిలో చూసి, ప్రజలు అవహేళన



చేస్తూ పెద్ద గోల ప్రారంభించారు. కొందరు మాంత్రికుణ్ణి బిగ పట్టుకుని అటూ యిటూ వూపారు. మరికొందరు వాణ్ణి తిడుతూ కొట్టబోయారు. సేనానాయకుడు వాళ్ళను వారిస్తూ, "మాంత్రికుడికి ఎలాంటి హానీ జరక్కూడదు. ఇది మహారాజు ఆజ్ఞ. వీడికి తెలిసిన ఒక రహస్యం వల్ల మన రాజ్యం సుభిక్షంకానున్నది. ప్రజలందరూ వెండి బంగారాల్లో మునిగి తేలవచ్చు." అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు ప్రజలు చేసే కోలాహలం, వాళ్ళనే ఈసడింపు మాటలూ విని అవమానంతో, భయంతో, వణికి పోయాడు. రాకాసిలోయలో లభించ నున్న



సర్వసంపదలతో రాజ్యాలే జయించాలను కున్న బ్రహ్మదండి, యిప్పటి తన నీచ స్థితికి కళ్ళవెంట నీరు కార్చసాగాడు. వాడు తనను చుట్టు ముట్టి దుర్భాషలాడుతున్న ప్రజలతో, "అయ్యలారా, నన్ను క్షమించండి, కరుణించండి! బుద్ధి గడ్డి తినటం వల్ల, ఏవేవో పొరపాట్లు చేశాను. వింత జంతువు ఆకారం ధరించి, అడవిలో నానా బీభత్సం చేసినవాడూ, సేనానాయకుణ్ణి చంపినవాడూ, జయమల్లనే నా గాడిదమారి శిష్యుడు. నేను కాదు. చేతనయితే వాణ్ణి, వాడి వెంట వున్న కేశవుడనే గొల్ల కాపరిని పట్టుకోండి," అంటూ బావురు మన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు అన్న మాటలు విన్న ప్రజలు, సైనికులూ జయ మల్లు గురించీ, కేశవుణ్ణి గురించీ అడిగారు. దానికి జవాబుగా సైనికులు, ఆ ఇద్దరూ కొండల్లో ఎక్కడో కనిపించకుండా దాక్కున్నారని చెప్పారు. ఆ వెంటనే, కాస్త తెగింపూ, కొంతంత ఉత్సాహమూ గల కొందరు యువకులు, కర్రలూ, ఈటెలూ తీసుకుని, అడవికేసి పరిగెత్తారు.

కేశవుడూ, అతని ముసలి తండ్రీ, జయ మల్లూ, కొండల్లోని, ఏనుగుల కొలను దాటి అవతల వున్న అరణ్యం చేరారు. చెట్టు







కొమ్మల్లో వుండి, బ్రహ్మపుర నగరానికేసి చూస్తున్న కేశవుడికి, కొందరు మనుషులు జట్లుజట్లుగా అడవిదార్ల వెంట బయలుదేరి, కొండకేసి రావటం కనిపించింది. తమకోసం కొండంతా గాలించిన బ్రహ్మపుర సైనికులు, తలలు వాల్చుకుని కొండ దిగి నగరం కేసి పోతున్నారు.

నగరం నుంచి వచ్చేవాళ్ళ చేతుల్లో వున్న కర్రలూ, ఈటెలూ చూస్తూనే కేశవుడు తమకు వాళ్ళ నుంచి ప్రమాదం రానున్నదని గ్రహించాడు. ఆ వెంటనే, అతడు చెట్టు దిగి వచ్చి, తన తండ్రికీ, జయమల్లుకూ, రానున్న ఆపదను గురించి చెప్పాడు. జయమల్లూ, ముసలివాడూ కూడా చెట్టు ఎక్కి చూశారు. వాళ్ళకూ కూడా నగరం వైపు నుంచి వస్తున్న యువకులు కనిపించారు.

ఆ ఇద్దరూ చెట్టు దిగి వచ్చారు. జయమల్లు కేశవుడితో, "సైనికుల కన్న, ఈ వచ్చేవాళ్ళు ఎక్కువ ప్రమాదకారులు. వీళ్ళు వందల సంఖ్యలో వస్తున్నారు. కనక వాళ్ళు మొత్తం కొండనూ, చుట్టూ వున్న అరణ్యాన్ని చుట్టుముట్టినా చుట్టుముట్టవచ్చు. అలా జరిగితే, మనం చిక్కులో పడిపోతాం. ఇప్పుడు అరణ్యం లోపలి భాగానికి పారిపోయేందుకూ కూడా మనకు అట్టే సమయం లేదు," అన్నాడు.

కేశవుడికీ, ముసలివాడికీ కూడా అలాగే అనిపించింది. తాము బ్రహ్మపుర వాసులకు చిక్కితే, నానా కష్టాలపాలూ కావలసి వస్తుంది. రాజభటులకు చిక్కిపోయిన బ్రహ్మదండి మాంత్రికుడు తమ మీద పగబట్టి వున్నాడు. హఠాత్తుగా ముసలివాడికి ఒక ఉపాయం తోచింది. అతడు కేశవుడితో, జయమల్లుతో యిలా అన్నాడు:

"నన్ను ఏదైనా అడవి తీగలు తెచ్చి కాళ్ళూ చేతులూ కట్టి, ఆ కనబడే రాతి మీద పడుకోబెట్టండి. మీరు వెంటనే యాగా





అరణ్యం లోపలికి పారిపొండి. మన కోసం వెతుక వస్తున్నవాళ్ళకు మీరు దొరకకుండా నే చూస్తాను."

ఇందుకు కేశవుడు ఒప్పుకోలేదు. జయమల్లుకూడా అభ్యంతరం చెప్పాడు. రాజగురువు లోగడ ముసలివాణ్ణి చూసి వున్నాడు గనక, బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యులు పారిపోయేందుకు సహాయపడ్డానన్న కారణం చెప్పి, అతణ్ణి శిక్షించ గలడని వాళ్ళు నమ్మారు. కాని, ముసలివాడు పట్టు పట్టాడు. ముగ్గురూ శత్రువులకు దొరికి పోయేకన్న, కనీసం ఇద్దరయినా సుర క్షితంగా వుండటం మేలుకాదా? అన్నాడు.



"నేను, మీ యిద్దరూ పట్టుకుని కాళ్ళూ చేతులూ కట్టి పడవేసి పారిపోయారని చెపుతాను. ముసలివాణ్ణి! నా మాట వాళ్ళెందుకు నమ్మరు?" అని ప్రశ్నించాడు కేశవుడి తండ్రి.

చివరకు ముసలివాడి బలవంతం మీద చేసేదేమీ లేక, జయమల్లు అతణ్ణి అడవి తీగలతో కాళ్ళూ చేతులూ కట్టి, ఒక ఎత్తయిన రాతి మీద పడుకో బెట్టాడు. తరవాత కేశవుడూ, తనూ ప్రమాదం తొలగగానే, వచ్చి కలుసుకుంటామని చెప్పి, అరణ్యం లోపలికి పరుగు తీశారు.

కొద్ది సేపటికల్లా, బ్రహ్మపుర నగర వాసులు కొండలూ గుట్టలూ గాలిస్తూ చేసే కోలాహలం ముసలివాడు విన్నాడు. అతను గొంతెత్తి బిగ్గరగా, "రక్షించండి! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే బ్రహ్మపురం వాళ్ళు కొందరు కర్రలూ, ఈటెలూ ఊపుకుంటూ అక్కడికి వచ్చి, ముసలివాణ్ణి చూసి ఆశ్చర్య పోయారు. "అయ్యా, నా కట్లు విప్పి కాపాడండి. మీరు మాంత్రికుడి శిష్యుల కోసం కొండ కోనలన్నీ గాలిస్తున్నా రని నాకు తెలుసు. వాళ్ళే నాకీ దుస్థితి కలి గించారు," అన్నాడు.







ఆ వెంటనే నలుగురైదుగురు యువకులు ముసలివాడి కట్లు విప్పసాగారు. కొందరు, "వాళ్ళెటు పోయారు? అరణ్యంలోనే దాక్కున్నారా?" అని ప్రశ్నించారు.

"అయ్యా, వాళ్ళు కాలాంతకులు. పులికి తెలియకుండా దాని పాలు పితికే రకం. మీరు వాళ్ళ కోసం అరణ్యాలన్నీ గాలిస్తారని గ్రహించి, బిచ్చగాళ్ళలాగా వేషాలు మార్చుకుని, బ్రహ్మపురం కేసే పరిగెత్తారు," అన్నాడు ముసలివాడు.

అక్కడ చేరిన వాళ్ళంతా ఔరా అని ముక్కుల మీద వేళ్ళు వేసుకున్నారు. వాళ్ళల్లో బాగా తెలివిగలవాణ్ణనుకునే ఒకడు, "భలే మోసం! మనం ఎక్కడైతే వాళ్ళ కోసం వెతకమో అక్కడికే వెళ్ళారన్న మాట! రాజద్రోహులని తెలిసిపోయిన తరవాత ఎవరైనా నగరం వదిలి అరణ్యాల్లోకి పారిపోతారు. వీళ్ళు అరణ్యాలు వదిలి నగరంలోకి పారిపోయారు! అందువల్లనే వాళ్ళు మన సైనికులకు దొరకలేదు!" అన్నాడు.

ఈ విధంగా ముసలివాడి మాటల్లో అందరికీ నమ్మకం కుదిరిపోయింది. వెంటనే వాళ్ళు, జట్లు జట్లుగా అన్ని వైపులకూ పరిగెత్తుతూ, "ఓహోరా! మాంత్రికుడి శిష్యులిద్దరూ బిచ్చగాళ్ళ వేషాలు వేసుకుని నగరం కేసి పారిపోయారోహో!" అంటూ కేకలు పెట్టారు.

వెంటనే జనం నగరంలో వున్న బిచ్చగాళ్ళందర్నీ దొరక పుచ్చుకునేందుకు నగరం కేసి పరిగెత్తారు.

బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుల వేటకు బయలుదేరిన ప్రజలు తిరిగి నగరంలోకి గుంపులు గుంపులుగా వస్తూండగా, రాచనగరులో బ్రహ్మదండి మాంత్రికుడు రాజుగారి ముందు చేతులు కట్టుకు నిలబడి, తనకు ప్రాణభిక్ష పెట్టవలసిందిగా ఆయన్ని బతిమాలుకుంటున్నాడు.



రాజుగారూ, రాజగురువూ, మంత్రి, సేనానాయకుడూ మాంత్రికుణ్ణి ప్రశ్నించి రాకాసిలోయ రహస్యమేదో తెలుసుకోవాలని చూస్తున్నారు. కాని, ముందుగా తనకు ప్రాణహాని జరగదని అభయం యిస్తే తప్ప, తను ఆ రహస్యం చెప్పనని మాంత్రికుడు పట్టుపడుతున్నాడు.

"నీ కేమి ప్రాణాపాయం కలగదని రాజుగారి పక్షంగా నేను అభయం యిస్తున్నాను," అన్నాడు రాజగురువు. రాజు అంగీకార సూచకంగా తలాడించాడు.

"రాకాసిలోయలో ఏవో అపూర్వ ధనరాసులున్నవని నువ్వు చెప్పేమాట



నిజమా? నిజమైతే అందుకు రుజువేమి చూపిస్తావు?" అని అడిగాడు రాజగురువు, మాంత్రికుణ్ణి.

"రుజువా? రాజగురు మహాశయా! ఉపాసకుల కుండల మర్రి. ఉన్మత్త భైరవుడు స్వయంగా ప్రత్యక్షమై చెప్పగా, ఈ చెవులతో విన్నాను. అంతకన్న రుజువేమి కావాలి?" అన్నాడు బ్రహ్మదండి మాంత్రికుడు.

"ఆ మాటలు నమ్మదగినవేనా?" అని ప్రశ్నించాడు రాజగురువు.

"భైరవా, భైరవా! పాపం హరించుగాక!" అంటూ మాంత్రికుడు రెండు చెవులూ మూసుకుని, "అరవైయ్యేళ్ళుగా, ఆ భైరవేంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకునేందుకు నిష్ఠతో ఉపాసన చేశాను. అఖరుకు, ఆ రాకాసిలోయ చేరేందుకు తోడ్పడవలసి వున్న జాతకుణ్ణి కూడా పట్టుకున్నాను. తమరు నా మాటల్లో నమ్మకం వుంచకపోతే, యిక నాకా కాలభైరవుడి పాదచతుష్టయమే శరణ్యం!" అంటూ భక్త్యావేశంలో ముందుకు పడిపోయాడు.

"గురువర్యా, వీడు దుష్టుడైనా, గొప్ప భక్తుడిలా వున్నాడు," అంటూ రాజు ఆశ్చర్యం కనబరిచాడు. అంతలో ద్వారం



వద్ద కలకలం బయలుదేరింది. సేనా నాయకుడు అక్కడికి వెళ్ళాడు. ఇద్దరు సైనికులు రొప్పుతూ రోస్తూ, అతడి ముందుకు వచ్చి నిలబడ్డారు. వాళ్ళను చూస్తూనే రాజ గురువు చేయి వూపి, "లోపలికి రండి! ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"అయ్యా, నగరంలోని యువకులు, కన పడిన బిచ్చగాళ్ళనల్లా పట్టుకుని, 'నువ్వు మాంత్రికుడి శిష్యుడివేనా, నిజం చెప్పు?' అని గొడ్డను బాదినట్టు బాదుతున్నారు. అర్థంపాయిన మా మీదకూడా వాళ్ళు కర్ర లెత్తుతున్నారు," అని చెప్పారు సైనికులు.

"ఏమిటి వింత?" అంటూ రాజు, సేనాని కేసి చూశాడు.

"బ్రహ్మదండి శిష్యు లిద్దరూ, బిచ్చగాళ్ళ వేషాలు వేసుకుని, నగరంలో తిరుగుతున్నా రని ఒక పుకారు పుట్టింది. అందులో వున్న నిజమెంతో తెలీదు," అన్నాడు సేనా నాయకుడు.

రాజగురువు బోర్లా పడివున్న మాంత్రికుణ్ణి కాలితో తన్ని, "బ్రహ్మదండీ, లేలే, విన్నావా ఈ పుకారు! బిచ్చగాళ్ళ వేషంలో వున్న, నీ శిష్యుల్ని గుర్తు పట్టగలవా?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు చప్పున లేచి నిలబడుతూ, "గురు ప్రభో! వాళ్ళను బిచ్చ గాళ్ళ వేషంలో కాదు, మహారాజుల వేషంలో వున్నా గుర్తుపట్ట గలను," అన్నాడు ధీమాగా. అప్పటివరకూ నోరు మెదపకుండా వున్న మంత్రి, "అయితే, మహారాజా! నగరంలో వున్న బిచ్చగాళ్ళందర్నీ పట్టుకుని యిక్కడికి తెప్పించమన్నారా?" అని అడి గాడు. రాజుగారు సరే నన్నట్టు తల వూపాడు. మంత్రి సేనానాయకుడూ గది నుంచి బయటికి వెళ్ళారు. వాళ్ళ ఆజ్ఞ కాగానే సైనికులు బిచ్చగాళ్ళందర్నీ వెతికి పట్టుకు వచ్చేందుకు, నగరం లోని అన్ని వీధు లకూ పరిగెత్తారు. —(ఇంకా వుంది)





# భూతాలు చేసిన పెళ్ళి

## 2

నాగభూతం హసనను తెచ్చి రాజభవనం సమీపంలో ఒక అరుగు పైన పడుకోబెట్టి, నిద్ర లేపింది. మొదట్లో హసనకు అంతా కల అనిపించింది. తాను పడుకున్నది తన తండ్రి సమాధిలో కాదు సరేకదా, తన చుట్టూ ఉన్న నగరం బస్రా కూడా కాదు. అతను ఆశ్చర్యంతో అరవబోయే సమయానికి ఒక పొడుగుపాటి మనిషి, గడ్డం గలవాడు, ఎదట ప్రత్యక్షమై, ఊరుకోమని సంజ్ఞ చేశాడు.

తరవాత ఆ మనిషి ఇలా చెప్పాడు, "నేనొక మంచి భూతాన్ని. నీ అందానికి తగిన భార్యను ఇవ్వటానికి ఈ కైరో నగరానికి తెచ్చాను. నేను చెప్పేది శ్రద్ధగా విను, అలా చెయ్యి. వెంటనే బయలుదేరి స్నానశాలకు వెళ్ళు. అందులో నుంచి ఒక గూని పెళ్ళికొడుకు వస్తాడు. వాడి వెంట జనం చాలా మంది ఉంటారు. ఆడేవాళ్ళూ, పాడేవాళ్ళూ ఉంటారు. నువ్వుకూడా వారిలో చేరి, వారిలాగే ఒక వెలిగించిన కొవ్వొత్తి పట్టుకో. ఇదుగో కొవ్వొత్తి. పెళ్ళికొడుకు పెళ్ళి ఇంటికి వచ్చేటప్పుడు నువ్వు వారి సరసన చేరి నడు. ఆడే వాళ్ళూ, పాడే వాళ్ళూ పెళ్ళి కొడుక్కు సలాం చేసినప్పుడల్లా ఈ సంచిలో చెయ్యి పెట్టి బంగారం విదజల్లు. ఈ సంచీ తీసుకో. ఇందులో ఉండే బంగారం తరిగిపోతుందన్న భయం నీకు వద్దు. ఎంత తీసినా ఇందులో ఇంకా బంగారం ఉంటుంది. అందుచేత నువ్వ ఆ గుంపులో వాళ్ళందరిని మంచి చేసుకోవచ్చు. తరవాత పెళ్ళి ఇంటికి చేరగానే గుంపులో వున్న వాళ్ళందరూ వెళ్ళిపోయినా కూడా నీవు మాత్రం గూనివాడి పక్క నుంచి వెళ్ళిపోకు!"

వి. మాధవరావు



ఈ మాటలు చెప్పి ఆ మనిషి మాయ మయాడు. హసన్‌కు అంతా గారడీగా ఉన్నది. అయినా భూతం చెప్పినట్టు చెయ్య డానికే అతను నిశ్చయించుకుని, కొవ్వొత్తి తీసుకుని స్నానశాలకు వెళ్ళాడు. అక్కడ చాలామంది ఉన్నారు. అందరి చేతులలో కొవ్వొత్తులున్నాయి.

గూని పెళ్ళికొడుకు స్నానశాల నుంచి బయలుదేరగానే, ఆడే వాళ్ళతోనూ, పాడే వాళ్ళతోనూ ఊరేగింపు సాగింది. హసన్ జనాన్ని తోసుకుంటూ ముందుకు వచ్చి, గూని పెళ్ళికొడుకు పక్కనే నడవసాగాడు. ఆ జనంలో అతని అందం చూసి ఆశ్చర్య పడనివారు లేరు. అతను ధరించిన దుస్తులు కూడా పెళ్ళికొడుకు దుస్తుల కన్న ఎన్నో రెట్లు ఖరీదైనవి.

ఊరేగింపులో ఆడేవాళ్ళూ, పాడేవాళ్ళూ ముందుకు వచ్చి పెళ్ళికొడుక్కు సలాము చేసినప్పుడల్లా హసన్ గుప్పిళ్ళతో బంగారం తీసి ఇచ్చాడు. భూతం ఇచ్చిన సంచీ నిజంగా అక్షయమైనది. దాని నుంచి అతను ఎంత బంగారం తీసి ధర్మం చేసినా ఇంకా నిండుగానే ఉన్నది.

ఊరేగింపు పెళ్ళి ఇంటికి చేరే సరికి హసన్‌ను దేవుడల్లే చూడనివారు ఊరే గింపులో ఒక్కరూ లేరు. ఆ పెళ్ళి ఇల్లు దివాణంలోనే ఉన్నది.

అక్కడి నౌకర్లు ఆడవాళ్ళనూ, పెళ్ళి కొడుకునూ తప్ప మిగిలిన మగవాళ్ళను ద్వారం వద్ద నిలిపి వేశారు.

కాని గుంపులో వున్న ఆడే స్త్రీలూ, పాడే స్త్రీలూ హసన్‌ను తమ వెంట లోపలికి రానివ్వాలని పట్టుబట్టారు.

హసన్ లోపలికి రాకపోతే తాము ఆడ మనీ, పాడమనీ స్పష్టంగా చెప్పారు. వాళ్ళు హసన్‌ను చేతులు పట్టుకుని లోపలికి లాక్కు పోతూంటే ద్వారపాలకులు ఏమీ చెయ్య లేక పోయారు.



లోపల చాలాసేపు ఆడవాళ్ళ ఆచ్చట్లూ ముచ్చట్లూ సాగాయి. గొప్ప గొప్ప అమీర్ల భార్యలందరూ ఉన్నారు. పెళ్ళికూతురు పెళ్ళికొడుకు వెంట మరొక అందగా డుండటం చూసింది. కాని అతనెవరో, అక్కడ ఎందుకున్నాడో ఆమెకు ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

వేడుకలన్నీ అయినాక ఆడవాళ్ళు పెళ్లి కూతుర్ని పడక గదిలో దిగబెట్టి తమ దారిన తాము వెళ్ళిపోయారు. వేడుకలు జరిగిన హాలులో గూని పెళ్ళికొడుకూ, హసన్ మాత్రమే మిగిలారు.

"నువ్వుకూడా యిక్కణ్ణించి వెళ్ళిపో! నా వెంట దేనికి? పద!" అన్నాడు గూని పెళ్ళికొడుకు హసన్‌తో.

ఈ మాట వినగానే హసన్ లేచి బయటికి బయలుదేరాడు.

వాకిలి దగ్గిర అతనికి భూతం ఎదురై, "ఇంతకుముందు నేను చెప్పిందేమిటి? ఇటెక్కడికి పోతున్నావు? నీ దారి అటు!" అని చెప్పి, గూని పెళ్ళి కొడుకును అమాంతం ఎత్తుకుని మాయమైపోయింది.

గూనివాడు కళ్ళు మూసి తెరిచే లోపల ఒక చీకటి కొట్టులో ఉన్నాడు. వాడు అందులో నుంచి బయటికి రావటానికి విశ్వప్రయత్నం చేశాడు. కాని వాడికది సాధ్యం కాలేదు.

ఈ లోపల హసన్ భూతం చూపిన వేపుగా వెళ్ళి పెళ్ళికూతురున్న పడక గది దగ్గిర తారట్లాడాడు. భూతం మళ్ళీ అతనికి కనిపించింది. "లోపలికి వెళ్ళు. పెళ్ళి కూతురితో నీవే అసలు పెళ్ళికొడుకువని, ఆమె తండ్రి ఆమెను పరీక్షించటానికి ఇంత నాటకమూ ఆడాడని చెప్పు. తప్పక నమ్ముతుంది," అన్నది.

పెళ్ళికూతురు తల వంచుకుని ఒక మూల కూచుని ఉన్నది. హసన్ అడుగుల చప్పుడు సమీపించటం విని ఆమె ముఖం

ఒక భవనంగాని లేదు. తాను ఏదో నగరం వెలుపల ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆ నగరం ఏదో తెలియదు. అది కైరో కాదు, బస్రాకూడా కాదు.

హసన్ చుట్టూ జనం మూగి ఆశ్చర్యంగా చూస్తున్నారు. అతను ఎక్కడినుంచో ప్రయాణం చేసి వచ్చిన వాడిలాగా కనిపించటం లేదు. అతని శరీరం మీద కొద్దిపాటి దుస్తులే ఉన్నాయి.

"ఇదే ఊరు? ఏ దేశం?" అని అడిగాడు హసన్ చుట్టూ మూగిన జనాన్ని.

"ఇది సిరియా దేశం, డమాస్కస్ నగరం!" అన్నారు వాళ్ళు.

"రాత్రంతా కైరోలో ఉన్నవాణ్ణి తెల్లారే సరికల్లా డమాస్కస్‌లో ఎలా ఉన్నాను?" అన్నాడు హసన్ తెల్లబోతూ.

"మీది కైరో నగరమా?" అన్నారు జనం మరింత ఆశ్చర్యపోయి.

"కాదు, మాది బస్రా. నిన్న చీకటి పడ్డాక బస్రాలో పడుకుని, ఝాము రాత్రి వేళ కైరోలో లేచాను. కైరోలో పడుకుని ఇప్పుడు మళ్ళీ డమాస్కస్‌లో నిద్రలేచాను. ఇదంతా ఆ భూతాలు చేసిన పనే అయి ఉంటుంది!" అని గొణిగాడు హసన్.

అతని మాటలు విని అక్కడివాళ్ళు అతను తాగుబోతో, పిచ్చివాడో అనుకున్నారు.



పక్కకు తిప్పుకుని, "ఛీ, ఛీ! దగ్గిరికి రాకు! నిన్ను చూస్తేనే నాకు వాంతి!" అన్నది.

"నేను అంత వికారంగా ఉన్నానా?" అన్నాడు హసన్. ఆమె తల ఎత్తి చూసి ఆశ్చర్యపోయి, "మీరెవరు? పెళ్ళికొడుకు గూనివాడు కాదా?" అన్నది.

"అదంతా మీ నాన్న నిన్ను పరీక్షించటానికి ఆడిన నాటకం. నేనే అసలు పెళ్ళికొడుకును," అన్నాడు హసన్.

సిత్తల్ హసన్ అతని మాట నమ్మింది. ఆమె విచారమంతాపోయి ఆమెకు ఎక్కడ లేని ఆనందమూ కలిగింది. ఆ రాత్రి వాళ్ళు సుఖంగా గడిపారు.

తెల్లవార వచ్చే సమయంలో ఆడభూతం మగభూతాన్ని కలుసుకుని, "ఇంకా ఇక్కడే ఉన్నావా? ఆ కుర్రాణ్ణి ఎప్పటి చోట దిగబెట్టవద్దా?" అన్నది.

మగభూతం పడక గదిలోకి ప్రవేశించి, గాఢ నిద్రలో ఉన్న హసన్‌ను వీపున వేసుకుని బస్రా కేసి బయలుదేరింది. కాని అది బస్రా చేరకముందే సూర్యోదయం అయేటట్టుండటం చేత హసన్‌ను దమాస్కస్ నగరం వెలుపల దింపి తన దారిన తాను వెళ్ళిపోయింది.

హసన్ నిద్రలేచి చూసేసరికి పెళ్ళికూతురుగాని, పడక గదిగాని, ఆఖరుకు





హసన్‌కు తన వస్తువుల మూట జ్ఞాపకం వచ్చి తన దుస్తుల కోసమూ, వెయ్యి దీనారాలు గల డబ్బు సంచీ కోసమూ తన తలపాగా కోసమూ వెతకసాగాడు. కాని అవన్నీ కైరోలో దిగబడిపోయాయి.

అతను వెర్రివాడని జనం రూఢి చేసుకున్నారు. వారు తన వెంట పడటం చూసి హసన్ నగరం ప్రవేశించి, వీధుల వెంట పరిగెత్తి ఒక మిఠాయి దుకాణంలో జొరబడి లోపల దాక్కున్నాడు.

ఆ దుకాణం అబ్దుల్లా అనే వాడిది. అతను హసన్‌ను చూసి జాలిపడి అతని కథ అడిగి తెలుసుకున్నాడు. అంతా విన్న పిదప, "నాయనా, నీ కథ నేను నమ్ముతానుగాని మరెవరికీ ఈ విషయాలు చెప్పకు. నాకు పిల్లలు లేరు. నీ కష్టాలు తీరేదాకా నా ఇంట నీ యిష్టానుసారం ఉండు. ఈ దుకాణం నీదే అనుకో! నిన్ను నేను పెంచుకుంటాను," అన్నాడు.

"నీ యిష్టం, బాబాయ్!" అన్నాడు హసన్ కృతజ్ఞతతో.

అబ్దుల్లా హసన్ కోసం బజారు నుంచి మంచి దుస్తులు తెచ్చి, ఖాజీగారి సమక్షంలో శాస్త్రోక్తంగా అతన్ని తన కొడుకుగా దత్తత చేసుకున్నాడు.

* * *

సిత్తల్ హసన్ వివాహం జరిగిపోయిన మర్నాడు ఉదయమే ఆమె తండ్రి అయిన వజీరు షమ్స్ ఉద్దీను దిగులుతో, తన కుమార్తెకు జరిగిన అవమానకరమైన పెళ్లి గురించి తలుచుకుంటూ, తన కూతురు వద్దకు వచ్చాడు. ఆమె అంతకు ముందే నిద్రలేచి, తన భర్త లేకపోవటం చూసి, బయటికి వెళ్ళి ఉంటాడనుకుని, అతని కోసం ఎదురు చూస్తున్నది.

తన కూతురి ముఖంలో విచారంగాని, విషాదంగాని లేకుండా ఆనందంతో తొణికిసలాడుతూ ఉండటం చూసి షమ్స్ తన

కళ్ళను తానే నమ్మలేక, "నీ కీ పెళ్ళి తృప్తికరంగా ఉన్నదా, అమ్మా?" అని అడిగాడు.

"ఎందుకుండదు, నాన్నా?" అన్నది కూతురు ఆశ్చర్యంతో.

"అయితే, ఆ గూని మొగుడు నీకు నిజంగా నచ్చాడా?" అన్నాడు తండ్రి.

కూతురు చిరునవ్వు నవ్వి, "అంతా ఎందుకు నటిస్తావు, నాన్నా? నీ మోసం నాకు తెలిసిందిగా!" అన్నది.

కూతురేమంటున్నదీ షమ్సీకు అంతు పట్టలేదు. కాని ఆమెను ప్రశ్నించగా ఒక్క సంగతి బయటపడింది. కిందటి రాత్రి ఆమె గడిపినది గూని పెళ్ళికొడుకుతో కాదు. గూనివాడి కోసం వెతికించగా వాడు చీకటి కొట్లో దొరికాడు.

"ఏమిరా? గడిచిన రాత్రి నువ్వు నా కూతురి వెంట లేవా?" అని షమ్సీ వాణ్ణి అడిగాడు.

"మీ అమ్మాయి నిఖ్ఖా చేసినట్టు నటించి తెల్లవార్లూ నన్ను చీకటి కొట్టులో పెట్టి తాళం వేశారు! మీకూ, మీ కూతురికీ ఒక్క దణ్ణం!" అంటూ గూనివాడు కోపంగా వెళ్ళిపోయాడు.

సుల్తాను ఒకటి తలిస్తే దైవం మరొకటి చేసినట్టు షమ్సీ గ్రహించాడు. ఆయన



తన కుమార్తె గదికి తిరిగి వచ్చి, "ఇంతకూ నిన్ను పెళ్ళాడిన అసలు వాడెక్కడ? అతని పేరేమిటి? ఊరేమిటి?" అని అడిగాడు.

"ఆయన తిరిగి రాగానే అన్నీ విచారించు." అన్నది సిత్తల్ హుసన్.

ఆమె తన తండ్రికి గదిలో వున్న హసన్ తాలూకు దుస్తులూ, తలపాగా, డబ్బు సంచీ మొదలైనవి చూపింది.

ఎన్ని రోజులు ఎదురు చూసినా, కైరో నగరమంతా గాలించినా కూడా షమ్సీ అల్లుడి జాడ తెలియలేదు. ఆ మనిషి పూర్తిగా అదృశ్యుడైపోయాడు. చేసేదిలేక



షమ్సు తన అల్లుడి ఉడుపులను మళ్ళీ మళ్ళీ పరీక్షించాడు. చివర కాయనకు తన అల్లుడి తలపాగాలో పెట్టుకుట్టిన కాగితం దొరికింది. అది తీసి చదువుకుని షమ్సు దైవమాయకు విస్తుపోయాడు. తన అల్లుడు మరెవరో కాదు, నూర్ కొడుకే! ఆఖరుసారి మాట్లాడుకున్నప్పుడు తామిద్దరూ అనుకున్న ప్రతి మాటా నిజమయింది.

కాని ఆ నూర్ కొడుకు హసన్ ఎక్కడున్నాడో అది మాత్రం తెలియరాలేదు. అతను ఎప్పటికైనా కనిపించక పోడు. కనిపించినప్పుడు అతనికి ఒక చిన్న పరీక్ష పెట్టి, ఆ రాత్రి సిత్తల్ హసన్‌తో గడిపినది అతనేనని రుజువు చేసుకోవాలి. అందుకుగాను షమ్సు తన కుమార్తె పడక గదిలో ఏయే వస్తువులు ఎక్కడెక్కడ ఉండినదీ వివరంగా రాసుకుని ఉంచుకుని, అల్లుడి రాకకు ఎదురు చూడసాగాడు.

కాలం గడిచింది. సిత్తల్ హసన్ గర్భవతిగా ఉండి తొమ్మిది నెలల అనంతరం ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. వాడికి అజీబ్ అని పేరు పెట్టారు.

తల్లి దండ్రు లిద్దరిలాగే వాడు కూడా చాలా చక్కనివాడు.

అజీబ్ ఏడేళ్ళ వాడయాక బడికి వెళ్ళనారంభించాడు. వాడు బడిలో ఇతర పిల్ల



ఐను చాలా హీనంగా చూసేవాడు. వాళ్లను తన్నేవాడు, మొట్టేవాడు, "నే నెవరను కున్నావురా? మా నాన్న వజీరు!" అని ప్రగల్భాలు పలికేవాడు.

ఇలా అజీబ్ దౌర్జన్యం చేస్తుంటే మిగిలిన పిల్లలు చాలాకాలం సహించి, చివరకు గురువుగారితో మొరపెట్టుకున్నారు.

గురువు వాళ్ళకు, "నేను చెప్పినట్టు చేశారంటే అజీబ్ మీ జోలికి ఎన్నటికీ రాడు. రేపు ఆటల సమయంలో మీలో ఒకడు, 'నాకు భలే మంచి ఆట తెలుసు. కాని ఆటలోకి వచ్చేవాళ్ళు ముందుగా తమ తల్లి పేరూ, తండ్రి పేరూ చెప్పాలి. అలా చెప్పలేని వాళ్ళు ఆటలోకి రాగూడదు,' అనండి," అని సలహా ఇచ్చాడు.

మర్నాడు గురువుగారు చెప్పిన ప్రకారమే చేశారు. వాళ్ళు అజీబ్ చుట్టూ చేరి, "ఒక మంచి ఆట ఉన్నది. ఆటలో చేరేవాళ్ళు వాళ్ళ అమ్మ పేరూ నాన్న పేరూ చెప్పాలి," అన్నారు. కొందరు తమ తల్లి దండ్రుల పేర్లు చెప్పాక అజీబ్, "మా అమ్మ పేరు సిత్తల్ హుసన్, మా నాన్న పేరు షమ్సు అల్దిన్, వజీర్!" అన్నాడు. ఈ జవాబుకు అందరూ నవ్వారు.

"వజీరుగారు మీ తాత. మీ నాన్న పేరు చెప్పు!" అని పిల్లలు కేకలు పెట్టారు.





"వాడికి వాళ్ళ నాన్న పేరుకూడా తెలీదు," అని కొందరు గేలి చేశారు.

అజీబ్ ఉక్రోషంతో ఏడుస్తూ తల్లి వద్దకు వెళ్ళాడు. కొడుకును సముదాయించి నిజం తెలుసుకున్న మీదట సిత్తల్ హుసన్ తన భర్తను తలుచుకుని లోపున ఏడవసాగింది. తల్లి కొడుకులు ఏడుస్తూ ఉండగా షమ్సు వచ్చి, వారి ఏడుపుకు కారణం తెలిసినాక తానుకూడా కంట తడి పెట్టాడు.

తరవాత షమ్సు సుల్తాను దగ్గిరికి వెళ్ళి, తన అల్లుణ్ణి వెతకబోవటానికి ఆయన అనుమతి పొందాడు. షమ్సు ఏ నగరంలోనైనా సరే తనకు కావలిసిన మనిషి కోసం వెతకటానికి అవసరమైన అధికార పత్రాలనుకూడా సుల్తాను ఇచ్చాడు.

షమ్సు సుల్తానుకు కృతజ్ఞత తెలుపుకుని, అప్పటికప్పుడే ప్రయాణ సన్నాహాలు చేసుకుని, ఒక్క గంట లోపల తన కుమార్తెనూ, మనవణ్ణీ పరివారాన్నీ తీసుకుని బస్రాకు బయలుదేరాడు. వారు చాలా రోజుల అనంతరం డమాస్కస్ చేరుకుని, నగరం వెలపల డేరాలు దింపి, అక్కడ రెండు రోజులపాటు విశ్రాంతి తీసుకోవటానికి నిశ్చయించారు.

డమాస్కసే చాలా అందమైన నగరం. అందుచేత అక్కడి వింతలు చూడటానికి షమ్సు పరివారమంతా వెళ్ళిపోయారు. అజీబ్ కూడా, తనను చిన్నతనం నుంచి పెంచిన సయ్యద్ అనే నౌకరు వెంట నగరం చూడటానికి బయలుదేరాడు.

వారిద్దరూ వీధులన్నీ తిరుగుతూ విధి వశాన హసన్ ఉండే మిఠాయి దుకాణం దగ్గిరికి వచ్చారు. హసన్ ఇప్పుడా దుకాణానికి యజమాని. అతను ముసలి దుకాణదారుకు దత్తత అయి పదమూడేళ్ళయింది. ముసలివాడు పోయినాక దుకాణం హసన్‌దయింది. హసన్ అజీబ్‌ను చూస్తూనే ఏదో ఒక వింత ఆకర్షణకు గురి అయాడు.



ఆ కుర్రవాడు తన కొడుకని తెలియకుండానే హసన్ శరీరం పులకరించింది. అతను అజీబ్‌తో, "లోపలికి రా, చిన్న బాబూ! నేను చేసిన మిఠాయి సరుకు రుచి చూసి పోదువుగాని," అన్నాడు.

అజీబ్‌కు కూడా తండ్రిని చూడగానే ఏదో కదలిక మనసులో కలిగింది. హసన్ గొంతులో వాడికి కొంత దైన్యం కూడా స్ఫురించింది. అందుచేత వాడు తన నౌకరును, "సయ్యద్, పాపం, ఈ మనిషి ఎంతో ప్రేమతో పిలుస్తున్నాడు. పోయి మిఠాయీలు రుచి చూద్దామా ఏమిటి?" అని అడిగాడు.

"వద్దు, బాబూ, వద్దు. తమలాటి ప్రభువుల బిడ్డలు ఇలాటి దుకాణాలలోకి వెళ్ళి భోంచెయ్యగూడదు! ఎంతమాత్రం వీల్లేదు. నా మాట వినక పోయ్యావో, తాత గారితో చెపుతాను," అన్నాడు సయ్యద్.

"నాయనా, నేను ఏం ద్రోహం చేశాను? బానిసనైనంత మాత్రాన నీకు హృదయం లేకుండా పోదుగద!" అని హసన్ బతిమాలిన మీదట సయ్యద్ మెత్తబడి దుకాణంలోకి వెళ్ళటానికి అంగీకరించాడు.

హసన్ ఆ ఇద్దరినీ దుకాణంలోకి తీసుకుపోయి, తన దగ్గిర ఉన్న మంచి పింగాణీ గిన్నెలలో దానిమ్మ మురబ్బా తెచ్చి వారి ముందు పెట్టాడు. ఈ మురబ్బా ఒక ప్రత్యేకమైన వంటకం. అందులో బాదం పప్పులూ, కొన్ని సుగంధ ద్రవ్యాలూ వేస్తారు. దీనిని హసన్ తల్లి స్వయంగా సృష్టించింది. ఆమె దగ్గిర హసన్ చిన్నతనంలోనే నేర్చుకున్నాడు. ఈ దానిమ్మ మురబ్బా చేసే పద్ధతి హసన్‌కూ, అతని తల్లికీ తప్ప మూడో ప్రాణికి తెలియదు.

అజీబ్ మురబ్బా తింటూ హసన్‌తో తన తండ్రి ఎక్కడ ఉన్నదీ తెలియదనీ, ఆయన కోసం తానూ, తన తాతా దేశాలన్నీ శోధిస్తున్నామనీ చెప్పాడు. ఆ మాట విన్న

తరవాత కూడా వాళ్ళు వెతుకుతున్నది తన కోసమేనని హసన్‌కు తట్టలేదు.

మురబ్బా మహా రుచిగా ఉండటంచేత అజీజ్, సయ్యద్ జాస్తిగానే తిన్నారు. తెలియకుండానే చాలాసేపు గడవటంచేత సయ్యద్ అజీజ్‌ను వెంట పెట్టుకుని తమ గుడారానికి బయలుదేరాడు.

అజీజ్ తన దుకాణం దాటి వెళ్ళగానే హసన్ ప్రాణం గిలగిలా కొట్టుకున్నది. ఆ కుర్రవాడు అతన్ని సూదంటురాయిలాగా ఆకర్షిస్తున్నాడు. అందుచేత హసన్ తన దుకాణానికి తాళం పెట్టి గబగబా నడుస్తూ అజీజ్ వెనకే వెళ్ళాడు.

సయ్యద్ వెనక్కు తిరిగి హసన్‌ను చూసి అజీజ్‌తో, "చూశావా, అబ్బాయిగారూ? ఆ మిఠాయి దుకాణంవాడు మన వెంట తగిలాడు. ఆ కాస్త మిఠాయీ మన పరువు తీసేస్తుంది. వీడు మన డేరాలకు వచ్చి తన దుకాణంలో మీరు మిఠాయి తిన్నట్టు బయట పెట్టాడో నన్ను వజీరుగారు నిలువునా చీల్చేస్తారు!" అన్నాడు.

"ఊరికే కంగారు పడకు, సయ్యద్. ఈ రోడ్డు మనం వేయించామా? మన డేరాల కేసి వచ్చేట్టు కనబడితే అతన్ని అప్పుడే తరిమేద్దాం," అన్నాడు అజీజ్.

కాని హసన్ ఊరు దాటినాక కూడా అజీజ్ వెనకనే వచ్చాడు. అంత దూరంలో డేరా లున్నాయి. అజీజ్ వంగి నేల మీది నుంచి ఒక రాయి తీసి హసన్ నుదుట తగిలేటట్టు బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు హసన్ పడిపోయాడు. నుదుట పెద్ద గాయమై రక్తం కారింది. హసన్ కాస్సేపటిలోనే స్పృహ తెలిసి లేచి, తన తలపాగాలో నుంచి ఒక పీలిక చించి గాయానికి కట్టు కట్టుకుని, ఆ కుర్రాడి వెంట పడటం తన తప్పేననుకుంటూ దుకాణానికి తిరిగి వెళ్ళిపోయాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# అణాతో ఐశ్వర్యం

ఒక గ్రామంలో రత్తయ్య అనే పాలేరు ఒక భూస్వామి దగ్గిర పని చేసేవాడు. అతను భూస్వామి పశువుల సాలలోనే ఒక మూల పెళ్ళాం బిడ్డలతో కాపరం ఉంటూ తన రెక్కల కష్టంతోనే సంసారం ఈదు కుంటూ వస్తున్నాడు.

ఒకనాటి రాత్రి రత్తయ్యతో అతని భార్య, "ఎన్నాళ్ళు గడిచినా మనకు కడుపుకే జరగకుండా ఉంటే రేపు పిల్లల గతి ఏమయేట్టు? మనకిక మోక్షంలేదా?" అని అన్నది.

దానికి రత్తయ్య, "వ్యాపారం చేస్తే ఎంత డబ్బయినా సంపాదించవచ్చు. కాని వ్యాపారం చెయ్యాలంటే డబ్బుండాలి. నాకు తెలివితేటలు తక్కువైకాదు—పెట్టు బడికి ఒక్క అణా ఉంటే నెల తిర క్కుండానే వెయ్యి రూపాయలు లాభం చేస్తును. కాని ఆ అణా ఏదీ?" అన్నాడు.

భార్యా భర్తల మధ్య జరిగిన ఈ సంభా షణ గోడ అవతల ఉన్న భూస్వామి చెవుల పడ్డది. తన పాలెగాడు అణాతో ఏం వ్యాపారం చేస్తాడో, లాభం ఎలా తీస్తాడో చూడాలనుకుని ఆయన గోడ మీది నుంచి ఒక అణా కాసు రత్తయ్య గుడిసె పక్క పడేలాగా వేశాడు.

మర్నాటి ఉదయం కసువు ఊడుస్తుంటే ఆ అణా కాసు రత్తయ్య భార్యకు దొరికింది. ఆమె దాన్ని తీసుకుపోయి భర్తకు చూపుతూ, "అణా ఉంటే పెట్టుబడి చేసి లాభం తీస్తానంటివిగా! ఇదుగో అణా!" అని అతడికి ఇచ్చింది.

రత్తయ్య దాన్ని తీసుకుని భూస్వామి వద్దకు వెళ్ళి, "బాబూ, పశువుల సాలలో కసువు ఊడుస్తూంటే ఈ అణా దొరికింది. ఇది తమదై ఉంటుంది. తీసు కోండి," అన్నాడు.

ఇందుకూరి లక్ష్మీపతిరాజు

భూస్వామి ఆ అణా కాసును అటూ ఇటూ తిప్పి చూసి, "ఇది నాది కాదు. దొరికింది గనక నువే ఉంచుకో. ఎందుకైనా పనికి రావచ్చు," అన్నాడు.

రత్తయ్య, "చిత్తం!" అని భూస్వామి వద్ద శలవు పుచ్చుకుని బస్తీకి వెళ్ళాడు. అక్కడ పేదవాళ్ళకు చిన్న మొత్తాలు అప్పులిచ్చే వాళ్ళున్నారు.

అటువంటి వాడి దగ్గిరికి వెళ్ళి రత్తయ్య, "అయ్యా, ఈ అణా వడ్డీ కింద ముందుగానే తీసుకుని ఒక రూపాయి బదులివ్వండి. మీ రూపాయి సాయంకాలానికల్లా తెచ్చి మీ కిచ్చేస్తాను," అన్నాడు.

ఆ మనిషి ఇచ్చిన రూపాయి తీసుకుని ఇంకొకడి దగ్గిరికి వెళ్ళి వాడికి రూపాయి వడ్డీకింద ముందే ఇచ్చేసి, మర్నాడిస్తానని చెప్పి పది రూపాయలు అప్పు పుట్టించాడు రత్తయ్య.

ఆ పది రూపాయలూ వడ్డీ కింద తీసుకుని మరో వడ్డీ వ్యాపారి రత్తయ్యకు నూరు రూపాయలు అప్పిచ్చి కాగితం రాయించుకున్నాడు. దాన్ని తీసుకుపోయి రత్తయ్య ఒక పెద్ద వడ్డీ వ్యాపారస్థుడి కిచ్చి, "ఇది వడ్డీ కింద తీసుకుని వెయ్యి రూపాయలు అప్పివ్వండి. వారం పది రోజుల్లో ధాన్యం అమ్మగానే మీ డబ్బు మీ కిస్తాను," అన్నాడు.



పత్తి వ్యాపారి రత్తయ్య ఊరూ, పేరూ, అతన్ని ఎరిగిన భూస్వామి పేరూ అంతా విచారించి వెయ్యి రూపాయలు బదులిచ్చాడు. ఆ డబ్బు పుచ్చుకుని రత్తయ్య ఆ రోజే తన నూరు రూపాయల బాకీ, పది రూపాయల బాకీ, రూపాయి బాకీ చెల్లువేసి ఇంటికొచ్చి తన దగ్గిర మిగిలిన డబ్బు భార్యకు చూపించి, "చూశావా, అలాతో ఎంత డబ్బు పుట్టించానో?" అంటూ తాను చేసినదంతా చెప్పాడు.

"ఇదేం సంపాదనా? మళ్ళీ అప్పుల వాళ్ళకు వెయ్యి కట్టొద్దూ? తొమ్మిది వందలన్నాలేవే!" అన్నది భార్య.

"అసలు వ్యాపారం చేసినాక ఇంతకింత లాభం వస్తుంది. అది లాభం కాదు, పెట్టుబడి," అన్నాడు రత్తయ్య.

మర్నాడు తెల్లవారు జామునే బయలుదేరి రత్తయ్య జొన్నవాడ అనే గ్రామానికి వెళ్ళాడు. ఆ గ్రామం రైతులు జొన్నలు పండిస్తారు. పంట కోతకు సిద్ధంగా ఉంది. రత్తయ్య రైతులందరినీ కలుసుకుని, "ఈ యేడు మీ పంటంతా నేనే కొంటాను. ఇప్పుడే బయానా ఇచ్చేస్తాను. ధాన్యం కొలిచేటప్పుడు నేను చెప్పిన వాళ్ళకుగాని, నాకుగాని కొలవాలి," అంటూ తలా యాభై, పాతికా, పరకా బయానా ఇచ్చి కాగితాలు



రాయించుకున్నాడు. ధాన్యం ధరలో అతను వారికి లోపమేమీ చెయ్యలేదు, మామూలుగా పట్నం నుంచి వచ్చి కొనుక్కుపోయే వర్తకులిచ్చే ధరే తాను కూడా ఇస్తానన్నాడు.

రత్తయ్య ఇంటికి తిరిగి వచ్చిన రెండు మూడు రోజులకల్లా ధాన్యపు వర్తకులు వచ్చి జొన్నపంట యావత్తూ పొలం మీదనే అమ్ముడయిందని విని కంగారు పడ్డారు. ఎందుకంటె ఈ ధాన్యం మీద తీసే లాభాలతో వాళ్ళు ఏడాది పొడుగునా హాయిగా బతుకుతారు.

జొన్నవాడలో పండే ప్రతి గింజకూ ముందే బయానా ఇచ్చేసిన వాడు. ఫలానా గ్రామంలో ఉండే రత్తయ్య అని వర్తకులకు తెలిసింది. వారు అతన్ని వెతుక్కుంటూ వచ్చి, "మా కడుపు కొడితే నీకేం లాభం? మేము తాతముత్తాతల నాటి నుంచి ఈ ధాన్య వ్యాపారం చేస్తున్నాం. నువ్వు చూడబోతే ఈ వ్యాపారానికి కొత్తవాడివి. అందుచేత ఆ ధాన్యం మాకు వదిలిపెట్టు," అని బతిమాలారు.

"నేనైనా అంత ధాన్యం ఏం చేసుకుంటాను? మారు బేరానికి అమ్మకోవలసిందే. వ్యాపార ధర్మం మీకు తెలియనిది కాదు గద. నేను అంత ధరకు కొన్నాను. అంతకంటె హెచ్చు వేసి ఆ ధాన్యమంతా నా దగ్గిర నుంచి మీరే కొనుక్కోండి," అన్నాడు, రత్తయ్య.

వర్తకులు దారికి వచ్చి రత్తయ్యకు ఒక వెయ్యి రూపాయలు మిగిలేటట్టుగా ధాన్యం ధర నిర్ణయించారు. రత్తయ్య వారి దగ్గిర తీసుకున్న డబ్బులో నుంచి వడ్డీ వ్యాపారస్తుడికి వెయ్యి రూపాయలూ ఇచ్చేసి మిగిలిన వెయ్యీ పెట్టి కొంత పొలం కొనుక్కుని, ఇల్లు వేసుకుని పెళ్ళాం బిడ్డలతో సుఖంగా జీవించాడు. రత్తయ్య అన్నంత పనీ చేసినందుకు భూస్వామి ఎంతో సంతోషించాడు.





# శాప విమోచనం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ నీవు పడే శ్రమ చూస్తే, మలయవతీ నగర రాజైన శూరసేన మహారాజులాగా నీవు కూడా శాపానికి గురి అయావా అని నాకు సందేహం కలుగుతున్నది. శ్రమ తెలియకుండా ఉండగలందులకు గాను నీకు ఆ మహారాజు శాపవిమోచన కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

మలయవతి నగరానికి శూరసేనుడు రాజుగా ఉన్నంతకాలమూ అతని ప్రజలు పడరాని కష్టాలు పడ్డారు. ఈ దుష్ట పరిపాలన సహించలేక కొండప్రాంతాల ఉండే ప్రజలు రాజుగారిపైన తిరుగుబాటు చేశారు. వారు రాజశాసనాలను ధిక్కరించటమేగాక,

బేతాళ కథలు



నగర ప్రజల నుంచి రాజుగారికి ముట్ట వలసిన వస్తువులను బలాత్కారంగా తామే వసూలు చేసుకుపోయారు. రాజు వారిపైకి ఆయుధ భటులను పంపాడు. కాని వారు కూడా తిరుగుబాటుదార్లతో చేరిపోయారు. అంతకంతకూ తిరుగుబాటుదార్ల బలం హెచ్చింది. సామాన్య ప్రజలలోకూడా రాజు గారిపైన అసహ్యమూ, తిరుగుబాటుదార్ల పైన గౌరవమూ పెరిగాయి.

శూరసేనుడు పరిస్థితి సరిగా అర్థం చేసుకుని తిరుగుబాటు నాయకులతో రాజీ బేరాలు సాగించాడు. రాజుగారు న్యాయ పరిపాలన చేసినట్టయితే తమ అరాజక చర్యలు మానేస్తామని కబురు చేశారు తిరుగుబాటు నాయకులు. సంధి సంప్రతింపులు జరిపే నెపం మీద కొండ సరస్సు వద్దకు రమ్మని వారికి కబురు చేసి, ఆ నాయకులందరినీ సరస్సులోకి తోయించాడు రాజు.

ఆ తరవాత ఆయన మరి కొంతకాలం పాటు తన దుర్మార్గాలను యథేచ్ఛగా సాగించి చివరకు చనిపోయాడు.

చనిపోయినాక శూరసేన మహారాజు ఆత్మ కొలనుకు ఎగువనున్న కొండలో బందీ అయిపోయింది.

యమదూతలు రాజును తెచ్చి కొండ లోపల ఉన్న ఒక ఇంట్లో పెట్టారు. అతనికి తోడుగా ఉండేటందుకు అతని పెంపుడు పిల్లి నిచ్చారు.

ఆ ఇంట్లో అంతు లేని బంగారం ఏర్పాటు చేశారు. రాజు నడుముకు ఒక పెద్ద కత్తి తెచ్చి కట్టారు.

వారు అతనితో, "నీ కిష్టమైన పిల్లీ, ధనమూ, కత్తీ వదిలినదాకా నీవీ కొండ దిగలేవు, ఎక్కడికీ పోలేవు. ఇవి నీ అంతట నీవు వదిలించుకోలేవు. ఎవడైనా సాహసవంతుడో, లేక నీపై జాలి చెందినవాడో ఈ ప్రాంతాలకు వచ్చి వీటిని వదిలించాలి.





అంతదాకా ఏవీ కొండకు ఒంపీవి!" అని చెప్పి అదృశ్యులైపోయారు.

మొదట రాజుకు ఈ ఒంటరి జీవితం అంత బాధగా తోచలేదు. కాని రానురాను అతనికిది పెద్ద శిక్షగా పరిణమించింది. దశాబ్దాలూ, శతాబ్దాలూ గడిచిపోతున్నాయి. తాను ఎరిగిన వారంతా చచ్చిపోయారు. కాని ఒక్కరూ అతని చాయలకు రాలేదు. రాజు ఆత్మను ఆ కొండ మీద చూసినవారు ఆ విషయం ప్రచారం చేశారు. ఆ కొండకు దయ్యాలకొండ అనీ దాని దిగువనున్న కోనేటికి దయ్యాల కోనేరనీ పేరు వచ్చేసింది. అటుకేసి జనం రావటంకూడా మానేశారు. ఒకవేళ ఎవరన్నా దారి తప్పి వస్తే వాళ్ళు తన పిలుపు విని పారిపోయే వాళ్ళు. ఈ విధంగా నాలుగువందల ఏళ్ళు గడిచింది.

శూరసేనుడికి విముక్తి కలగనే లేదు. కాలక్రమాన మలయవతి నగరంకూడా శిథిలమై పోయింది.

దయ్యాలకొండకు కొంత దూరంలో ఒక గ్రామం ఉన్నది. అందులో గోపాలుడనే ఒక పేద కుర్రవాడుండే వాడు. వాడు ఒక భూస్వామి వద్ద కమతం చేస్తూండేవాడు. భూస్వామికి లక్ష్మి అని ఒక కూతురున్నది. ఆమెకు గోపాలుడంటే ఎంతో ఆదరమూ, అభిమానమూనూ. గోపాలుడు లక్ష్మిని ప్రేమించాడు. "నిన్ను పెళ్ళిచేసుకోవాలని ఉంది. నీకేమన్నా అభ్యంతరమా?" అని గోపాలుడడిగితే, "నాదేముంది? మా నాయన ఒప్పుకోవాలి గద!" అన్నది లక్ష్మి.

భూస్వామి ఒప్పుకుంటే లక్ష్మి తనను పెళ్ళాడుతుందని తెలుసుకుని గోపాలుడు సాహసించి తన కోరికను తన యజమానికి చెప్పాడు.

భూస్వామి ఈ ముక్క వింటూనే తోక తొక్కిన తాచులాగా లేచి, "ఏమిరా, నీ పొగరు! నా లక్ష్మిని నీ వంటి దరిద్రుడి

చేతిలో పెడతానా? అంత దురాశగలవాడివి నా కింద ఏం పని చేస్తావు? చాతనయితే చారెడు బంగారం తెచ్చి నాకు చూపించు, నా కూతుర్ని నీ కిచ్చి చేసే విషయం మాట్లాడదాం!" అన్నాడు.

గోపాలుడి కోరిక నెరవేరకపోగా ఉన్న పనికూడా ఊడింది. చారెడు బంగారం కాదుగదా పిడికెడు బంగారం తీసుకు రావటం కూడా వాడికి సాధ్యం కాదు. వాడు తన యజమాని ఇంటి నుంచి కొండ అవతల ఉన్న మరొక గ్రామానికి బయలు దేరాడు. నిరాశతో కుమిలిపోయి వాడు తల వంచుకుని కోనేటి గట్టు వెంబడి నడుస్తూండగా కొండ మీది నుంచి ఎవరో కేక పెట్టినట్టయింది.

గోపాలుడు తల ఎత్తి చూసేసరికి వాడికి కొండ మీద ఒక వింత ఆకారం కనిపించింది. ఎవరో పాతకాలపు రాజులాగా ఉన్నాడు. ఆ కొండ మీద దయ్యాలుంటాయని వాడు ఎప్పుడో విన్నాడు.

అది దయ్యమే అయి ఉండవచ్చుననుకుని గోపాలుడు, "ఎవరు మీరు? నాతో ఏంపని?" అని అడిగాడు.

"నేను శూరసేనమహారాజును. నీవు నిజమైన ధైర్యవంతుడవైతే ఈ రాత్రికి ఇక్కడికి వచ్చి నాకు విముక్తి కలిగించు.



నా పాపమే నాకు శాపమై చుట్టుకున్నది. నాకు శాపవిముక్తి చేశావంటే నీకు కోరి నంత బంగారం ఇస్తాను," అన్నాడు శూర సేన మహారాజు.

"సరే, రాత్రికి వస్తాను," అన్నాడు గోపాలుడు నిశ్చింతగా. ఆ రాత్రి వాడు వచ్చేసరికి శూరసేనుడు కొండ మీద నిలబడి వాడి కోసం ఎదురు చూస్తున్నాడు. గోపాలుడు దగ్గిరికి రాగానే ఆయన వాడితో తన నిర్బంధం గురించి చెప్పి, "ఇది ప్రమాదకరమైన పని. నీకు నిజమైన ధైర్య సాహసాలుంటేనే ఈ పనికి పూనుకో. నేను చెప్పినట్టు చేస్తివా నాకు విమోచనం కలిగించిన పుణ్యమూ ఉంటుంది, నీకు కావలిసినంత బంగారమూ లభిస్తుంది. లేదా నిజమైన సాహసి వచ్చినదాకా నేను నిర్బంధంలోనే ఉంటాను," అన్నాడు.

"నా కేమీ భయంలేదు. నేనేం చెయ్యాలో చెప్పండి," అన్నాడు గోపాలుడు.

శూరసేనుడు గోపాలుణ్ణి చేత్తో తాకాడు. మరుక్షణమే వారిద్దరూ కొండ లోపల చిత్రంగా నిర్మించిన ఒక ఇంట్లో ఉన్నారు. అది ద్వారాలు లేని గది. ఎక్కడ చూసినా కత్తులూ, ఈటెలూ, ఢాళ్ళూ, విల్లులూ, బాణాలూ, ఇతర మారణాయుధాలూ ఉన్నాయి. గదిలో ఒక పక్కగా పెద్ద పీపా





నిండా బంగారు మొహర్లుండి, ధగధగా మెరుస్తున్నాయి.

గోపాలుడు చుట్టూ కలయజూసే లోపునే ఒక బ్రహ్మాండమైన నల్ల పిల్లి పులిలాగా దూకుతూ వచ్చింది. దాన్ని చూసి గోపాలుడు నిర్ఘాంతపోయాడు.

"ఇది నా పిల్లి. దీనిని తీసుకుపోయి కోనేట్లో వేసిరావటం నీ మొదటి పని. జ్ఞాపకం ఉంచుకో—ఎంత భయం కలిగినా సరే, ఎంత బాధ కలిగినా సరే నీ నోటి వెంట ఎలాటి చప్పుడూ రాకూడదు. మూలగటం గాని కేక పెట్టటంగాని చేశావో, నాకు విముక్తి కలగదు సరేకదా, నీ ప్రాణంకూడా



దక్కదు. అందుచేత మౌనంగా ఈ పని ముగించి రా. తరవాత చేయవలసినది చెబుతాను," అన్నాడు శూరసేనుడు.

గోపాలుడు మారుమాట్లాడకుండా ఆ నల్ల పిల్లిని రెండు చేతులలోనూ ఎత్తుకున్నాడు. శూరసేనుడు వాల్ని స్పృశించగానే ఒక గోడ వాడికి దారి ఇచ్చింది. అందులో నుంచి వాడు కోనేటి దాకా నడిచి వచ్చాడు. నీటి ఒడ్డున నిలబడి పిల్లిని విసిరి నీటిలోకి వేశాడు. ఆ సమయంలో పిల్లి తన గోళ్ళను వాడి చేతులలోకి గుచ్చి కండలు చీలేలాగా పీకింది. భరించరాని బాధ కలిగింది. కెవ్వున కేక పెట్టబోయి, శూరసేనుడి మాటలు జ్ఞాపకం వచ్చి, పళ్ళు బిగబట్టి బాధను సహించాడు గోపాలుడు.

వాడు వంగి కోనేటి నీటితో తన చేతుల గాయాలు కడుక్కోబోయాడు. అంతవరకూ మామూలుగా ఉన్న నీరు కాస్తా తెర్లి వాడి పైకి మసులు నీళ్ళు ఎగ జిమ్మింది. వాడి ముఖం ఆ వేడికి భగ్గున మండింది. వాడు ఈ సారికూడా బాధ ఓర్చుకుని, వచ్చిన దారినే శూరసేను డున్న చోటికి పరిగెత్తుకుపోయాడు.

"భేష్! నువ్వు నిగ్రహం కల వాడివే. ఇంకొక్క పని చేస్తివా, నాకు విమోచనం





కలుగుతుంది. నా నడుముకు బిగించి ఉన్న ఈ కత్తిని జాగ్రత్తగా ఊడదియ్యి. అందాకటిలాగే ఎలాంటి ప్రమాదం జరిగినా మౌనంగా ఉండాలి సుమా!" అన్నాడు శూరసేనుడు.

ఇది చాలా తేలికైన పనిగా తోచింది గోపాలుడికి. కాని వాడు శూరసేన మహారాజు నడుము చుట్టూ ఉండే కత్తి తాడు ముడి అందుకోబోయే సరికి ఆయన శరీరం పెరిగి వాడికి ముడి అంది అందని ఎత్తుకు పోయింది. గోపాలుడు తన ముని వేళ్ళపైన నిలబడి ఎంతో కష్టం మీద ఆ ముడి ఊడదీశాడు. కాని మరుక్షణమే కత్తి సూటిగా వాడి పాదంపైన పడి ప్రాణం పోయినంత బాధ కలిగింది.

అప్రయత్నంగా నోటి వెంట కేక వెలువడే క్షణంలో గోపాలుడు అతి కష్టంమీద అణుచుకుని బాధను సహించాడు.

"నాయనా, నాలుగువందల ఏళ్ళుగా చెరలో ఉన్న నాకు విముక్తి కలిగించావు. ఆ కనపడే బంగారంలో నీకు కావలసినంత తీసుకో, నేను వెళ్ళిపోతాను," అన్నాడు శూరసేనుడు.

గోపాలుడు తనపై బట్ట తీసి అందులో దోసెడు బంగారు నాణాలు పోసుకున్నాడు. అంతలోనే శూరసేనుడూ, ఆయన ఉంచిన



గడచిన కలలాగా మాయమయింది. గోపాలుడు కొండ మీద ఉన్నాడు. తూర్పు తెల్లవారు తున్నది. చేతిలో బంగారు మొహర్ల మూట లేకపోతే జరిగినదంతా కల అని వాడు అనుకునేవాడే.

గోపాలుడు ఆ బంగారం తీసుకుపోయి భూస్వామి ఎదట పెట్టి, "ఇదుగో మీరు కోరిన బంగారం. లక్ష్మిని నాకు ఇచ్చి చెయ్యండి," అన్నాడు. భూస్వామి సంతోషంగా అంగీకరించి, వాడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఒక్క సందేహం. ప్రమాదకరమని ముందుగా తెలిసికూడా గోపాలుడు శూరసేనుడి విముక్తి కోసం ఎందుకు పూనుకున్నాడు? అందువల్ల బంగారం దొరుకుతుందనీ, ఆ బంగారంతో తాను ప్రేమించిన లక్ష్మిని పెళ్ళాడ వచ్చుననీ ఆశ చేతనా? తాను ఎంతగానో ప్రేమించిన లక్ష్మిని పెళ్ళాడలేక పోయినందువల్ల జీవితంపై విరక్తి చేతనా? లేక శాపగ్రస్తమై ఉన్న శూరసేనుడి ఆత్మ మీద జాలి చేతనా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గోపాలుడు స్వతహాగా పిరికివాడైతే, ధనాశగాని, ప్రేమ గాని, జాలిగాని వాణ్ణి సాహస వంతుణ్ణి చెయ్యలేవు. గోపాలుడు అసలు సాహస వంతుడు. అందుకే తన యజమాని ఎదట పడి ఆయన కూతురిని తన కిచ్చి చెయ్యమని అడిగాడు. చెయ్యాలిన పని ఎదురైనప్పుడు నిజమైన సాహసి ఎన్నటూ వెనకాడడు. అందుచేత గోపాలుడు సాహసించడానికి వాస్తవమైన కారణం వాడి సాహసమే," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# గుర్రమెక్కి పెళ్ళికొడుకు

గండు భీమన్న అడవి దారిన పడి బామ్మ ఉండే ఊరికి పోతూండగా దారిలో ఒకచోట ఒక చెట్టుకు ఒక అందమైన గుర్రం కట్టి ఉన్నది. భీమన్న గుర్రం ఎదుట ఆగి, ఎంతో సంతోషంతో దాని కేసి చూస్తూ నిలబడిపోయాడు.

షావుకారును గుర్రం మీద చూసినప్పటి నుంచీ తాను కూడా గుర్రం ఎక్కాలని వాడికి మోజుగా ఉన్నది. గుర్రం ఖరీదు అయిదువందలని షావుకారు చెప్పాడు. ఇప్పుడు తన వద్ద అయిదు వందలున్నాయి— దొంగలను పట్టిచ్చినందుకు తనకా అయిదు వందలు బహుమానం ఇచ్చారు. ఈ గుర్రం చూడబోతే షావుకారు గుర్రం కన్న చాలా అందంగా ఉన్నది. తనకు ఈ గుర్రాన్ని ఎవరన్నా అమ్మితే ఎంత బాగుండు నను కున్నాడు భీమన్న. అదే సమయంలో చెట్ల వెనకనుంచి ఎవరో వచ్చి, "ఎవరు నువ్వు? ఆ గుర్రం కేసి ఎందుకు అదే పనిగా చూస్తు న్నావు?" అని అడిగాడు.

"దీన్ని అమ్ముతావా? కొంటాను," అన్నాడు భీమన్న.

రెండో మనిషి కొంచెం ఆలోచించి, "ఏమిస్తావు?" అని అడిగాడు.

"నాకు గుర్రం ధర తెలియదను కున్నావా? అయిదు వందలు. ఇదుగో ఈ సంచిలో అయిదు వందలున్నాయి. కావలిస్తే ఎంచుకో!" అన్నాడు భీమన్న.

రెండో మనిషి ఆత్రంగా ఆ సంచీ తీసుకుని, "సరే, ఈ గుర్రాన్ని నువ్వు తీసు కుపో," అన్నాడు.

అసలు సంగతేమంటే ఆ గుర్రం వాడిది కాదు, ఒక జమీందారుది. ఆ జమీందారుకు మహాలక్ష్మి అని ఒక కూతురున్నది. ఆమె గుర్రపు స్వారిలో అంతేంనది. మహాలక్ష్మి కోసం తండ్రి సంబంధాలు వెతికేటప్పుడు

గండు భీమన్న కథలు—10



ఆమె ఈ గుర్రం మీద స్వారీ చెయ్యగలవాణ్ణే
చేసుకుంటానని పట్టుపట్టింది. ఈ గుర్రం
మీద స్వారీ చెయ్యటం తేలికైన పని కాదు.
అందుచేత చాలామంది దీన్ని ఎక్కి స్వారీ
చెయ్యటానికి ప్రయత్నించి, అపజయంతో
పాటు పరాభవంకూడా పొందారు.

అలా పరాభవం పొందిన వారిలో ఒకడు
అవకాశం చూసుకుని ఈ గుర్రాన్ని దొంగి
లించి అడవిలో కట్టేసి, దానికి ఒక మనిషిని
కాపలి పెట్టాడు. ఆ మనిషి ఇప్పుడు
ఆ గుర్రాన్ని గుండు భీమన్నకు అమ్మాడు.
భీమన్న యాభైరూపాయ లిచ్చినా వాడా
గుర్రాన్ని ఇచ్చేవాడే. ఆ సంగతి భీమన్నకు



తెలియదు. గుర్రం ఖరీదు అయిదు వంద
లని వాడి బుర్రలో పడిపోయింది. అది
మరి మారదు.

గుర్రం అమ్మినవాడు భీమన్నను,
"నీ కింతకూ గుర్రం ఎక్కటం వచ్చునా?
ఎప్పుడన్నా ఎక్కావా?" అని అడిగాడు.

"నే నెన్నడూ గుర్రం ఎక్కి స్వారీ చెయ్య
లేదనుకో. అయితేనేం? అదేం బ్రహ్మ
విద్యా?" అన్నాడు భీమన్న.

"అయితే ముందు గుర్రం మీద ఎక్కి
కూచో, తరవాత కట్టు విప్పుతాను," అన్నాడు
రెండోవాడు.

భీమన్న గుర్రం మీద ఎక్కి కూచున్నాక
వాడు గుర్రం మెడకు తగిలించిన తాడు
విప్పాడు. మరుక్షణమే గుర్రం శరవేగంతో
దౌడు సాగించింది.

భీమన్న బలం గలవాడు గనక తాళ్ళు
గట్టిగా పట్టుకుని, తన కాళ్ళు గుర్రం
పొట్టకు గట్టిగా అదిమి పట్టి, పడకుండా
చూసుకో గలిగాడు. మరొకడైతే గుర్రం
వేగానికి ఎప్పుడో కిందపడి పోవలిసిందే.

భీమన్న కింద పడిపోలేదన్నమాటేగాని,
గుర్రాన్ని ఆపటంగాని, కనీసం దాని వేగం
తగ్గించటంగాని, దాన్ని తనకు కావలిసిన
దారిన నడిపించటంగాని వాడికి సాధ్యం





కాలేదు. అది ఎటుపోతున్నదీ వాడికి తెలియదు. తెలిసినా ప్రయోజనం లేదు. అది ఎప్పుడు ఎక్కడ ఆగుతుందో దాని ఇష్టమేగాని వాడి ఇష్టం కొంచెంకూడా లేదు.

గుర్రం తిన్నగా జమీందారు ఇంటికి వెళ్ళి అక్కడ ఆగింది. జమీందారు నౌకర్లు, "దొంగ లెత్తుకు పోయిన మన గుర్రం తిరిగి వచ్చింది," అని కేకలు పెడుతూ భీమన్నను చుట్టు ముట్టారు.

"దొంగిలించట మేమిటి? దన్ని నేను అయిదు వందలు పోసి కొన్నాను: నష్టం లేదు. బాగా పరిగెడుతుంది!" అన్నాడు భీమన్న. నౌకర్లు భీమన్నను జమీందారు వద్దకు తీసుకుపోయారు. భీమన్న జమీందారుతో మిగిలిన విషయాలేమీ చెప్పక, తాను దొంగలను పట్టి ఇచ్చి అయిదు వందలు బహుమానం పొంది, దాంతో అడవిలో ఈ గుర్రాన్ని కొని, దానిమీద సవారీ అయివచ్చిన సమాచారం అంతా చెప్పాడు.

ఎవరూ స్వారి చెయ్యలేని గుర్రాన్ని భీమన్న స్వారి చేశాడని విని మహాలక్ష్మి భీమన్నను పెళ్ళాడటానికి ఒప్పుకున్నది. జమీందారుకు కూడా భీమన్న నచ్చాడు. వాడు గుర్రాన్ని స్వారి చెయ్యటమేగాక, దొంగల ముఠాను పట్టి ఇచ్చాడంటే



సమర్థుడై ఉండాలి. అయినా వాడి హోదా ఏమిటో తెలుసుకుంటే బాగుంటుందనుకుని ఆయన భీమన్నతో, "నాయనా, మా అమ్మాయి నిచ్చి చేస్తే పెళ్ళి చేసుకుంటావా?" అన్నాడు.

"ఓ, చేసుకుంటాను. మా బామ్మకూడా సంతోషిస్తుంది. నాకు పెళ్ళి కాదని మా బామ్మకు ఒకటే బెంగ," అన్నాడు భీమన్న.

"మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చేస్తే కట్నం ఏమిస్తావు?" అని జమీందారు అడిగాడు.

"కట్నానికేం భాగ్యం. బామ్మ ఒక పెద్ద బాన నిండా బంగారం దాచి ఉంచింది.

అది నా పెళ్ళి ఖర్చుకేనట. అదంతా కట్నం కింద తీసుకోండి," అన్నాడు భీమన్న.

"ఓహో, ఇది చాలా గొప్ప సంబంధమే. బానెడు బంగారం మనం ఏ తరంలోనూ కళ్ళ జూసి ఎరగం!" అనుకుని జమీందారు, పెళ్ళికి ముహూర్తం పెట్టించాడు. బామ్మనూ, బంగారాన్ని తీసుకురావటానికి మనుషులను పంపించాడు.

"పిచ్చి వెధవ" అని తన చేత ఎన్నోవేల సార్లు అనిపించుకున్న భీమన్న సరాసరి జమీందారు కూతురినే పెళ్ళాడుతున్నాడని విని బామ్మ పరమానందభరితురాలయింది. ఆమె జమీందారు ఇంటికి వచ్చి, పెళ్ళి కూతురి మెడలో మూడు ముళ్ళూ పడిన దాకా భీమన్న వెర్రిబాగులవాడన్నది బయటపడకుండా తన తెలివితేటలతో కప్పి పుచ్చింది.

పెళ్ళి అయినాక మటుకు ఆమె మహలక్ష్మితో, "అమ్మా, నీ మొగుడు పట్టి తెలివి తక్కువ దద్దమ్మ. వాణ్ణి నేనే పసితనం నుంచి పెంచి పెద్ద చేశాను. ఇక నుంచీ వాణ్ణి చూసుకునే భారం నీది. వాడి మనస్సు చాలామంచిది. తెలివితేటలు లేవన్నమాటే గాని కల్మషం ఎటువంటిదో వాడెరగడు!" అని చెప్పవలసిన మాటలు నాలుగూ చాటుగా చెప్పింది.

మహాలక్ష్మి తెలివిగలది. బామ్మ చెప్పినదంతా గ్రహించి ఆమె, "మీ మనవణ్ణి నేను కంటిని రెప్పలాగా చూసుకుంటాను లెండి. మా నాన్నగారికి నేనొక్కర్తెనే. అందుచేత మీ మనవణ్ణి ఇక్కడే ఉంచుకుంటారు. మీరు కూడా మాతో పాటే యిక్కడ ఉండి పొండి," అన్నది.

కాని బామ్మ ఉండలేదు. ఆమె తన ఇల్లూ వాకిలీ చూసుకోవాలని చెప్పి, భీమన్నను జమీందారుగారి కుటుంబానికి అప్పగించి తన ఇంటికి వెళ్ళిపోయింది.

—[పై మాసం ఆఖరు సంఘటన]





# విద్యామహిమ

దేవగిరి అనే ఊళ్ళో సోమదేవుడనే వాడికి ఇద్దరు కొడుకు లుండేవారు. పెద్దవాడు పొలమూ పుట్రా చూసుకుంటూ ఇంటి దగ్గిరే ఉండి పోయాడు. రెండో వాడు జయదేవుడు విద్యాభిలాషతో ఇల్లు విడిచి తగిన గురువును వెతుక్కుంటూ దేశ సంచారం బయలుదేరాడు.

జయదేవుడు తిండి లేకుండానూ, సరి అయిన నిద్ర లేకుండానూ చాలా కాలం ప్రయాణం చేసి చివరకు ఒక గ్రామంలో హరిశర్మ అనే ఆయన ఇంటి ముందు శోష వచ్చి పడిపోయాడు.

హరిశర్మ జయదేవుణ్ణి తన ఇంటి లోపలికి తీసుకుపోయి, తాగటానికి నీరిచ్చి, స్నానం చేయించి భోజనం పెట్టి అతడి సమాచారమంతా తెలుసుకున్నాడు. జయదేవుడు విద్యాభిలాషతో ఇల్లు వదిలిపెట్టి మంచి గురువు కోసం తిరుగుతున్నాడని విని హరిశర్మకు చాలా సంతోషమయింది. ఆయన గొప్ప పండితుడు. అందుచేత జయదేవుణ్ణి మూడేళ్ళపాటు తన ఇంటనే ఉంచుకుని, భోజనం పెట్టి చదువు చెప్పాడు. జయదేవుడు సూక్ష్మ బుద్ధి కావటంచేత ఆ మూడేళ్ళ కాలంలోనే గురువుగారికి తెలిసిన విద్యలన్నీ నేర్చుకున్నాడు.

తరవాత హరిశర్మ జయదేవుడితో, "నాయనా, ఇంకొక్క గురువు దగ్గిర కొన్ని విద్యలు నేర్చితే గాని నీ చదువు పూర్తి కాదు. ఆ గురువు ఒక కోయరాజు. అతను ఏకు చోర విద్యా, వేటా మొదలైనవన్నీ నేర్పుతాడు. అతడి దగ్గిరికి ఎలా వెళ్ళాలో నేను చెబుతాను," అన్నాడు.

హరిశర్మ చెప్పిన మార్గాన బయలుదేరి జయదేవుడు కోయరాజు వద్దకు వెళ్ళాడు. హరిశర్మ పంపిన శిష్యుడని తెలుసుకుని కోయరాజు జయదేవుణ్ణి తన వద్ద ఒక

ఆర్. వెంకటపతి



సంవత్సరం పాటు ఉండుకుని దొంగతనాలు చెయ్యటమూ, దొంగలను పట్టటమూ, మృగాల జాడలు తెలుసుకోవటమూ, వేటాడటమూ మొదలైన విద్యలన్నీ నేర్చాడు.

ఈ విధంగా సకల విద్యలూ నేర్చి జయదేవుడు ఇంటి మార్గం పట్టి వస్తూ, ఒక రోజు ఒక గ్రామం చేరి ఒక బ్రాహ్మణ గృహంలో మంచి నీరిమ్మని అడిగాడు. ఆ ఇంటి యజమాని జయదేవుణ్ణి లోపలికి ఆహ్వానించి, అతిథి సత్కారమంతా చేసి అతని సంగతి అంతా తెలుసుకుని, "అబ్బాయీ, నీ విద్యా కౌశలం పరీక్షించటానికి ఒక్క ప్రశ్న అడగనా?" అన్నాడు.

"అడగండి," అన్నాడు జయదేవుడు.

"నీవు రాకముందు ఈ ఇంటికి ఎవరు వచ్చారు? ఈ ఇంటి ముందుగా ఎవరెవరు వెళ్ళారు? చెప్పు చూస్తాం!" అన్నాడు ఇంటి యజమాని.

జయదేవుడు లేచి బయటికి వెళ్ళి, కొంత సేపయాక తిరిగి వచ్చి, "నేను రాకపూర్వం మీ ఇంటికి నలుగురు వ్యక్తులు వచ్చారు. వారు రాజభటులో, సైనికులో అయి ఉంటారు. వారు మీ ఇంటి నుంచి బయలు దేరి ముందుకు సాగిపోయారు. వారికన్న ముందుగా ఒక మనిషి మీ ఇంటి ముందుగా వెళ్ళాడు. వాడి నెత్తి మీద ఒక బొగ్గుల మూట ఉన్నది. వాడేదో దొంగతనం చేసి ఉంటాడు," అని ఇల్లు గల బ్రాహ్మణుడితో అన్నాడు.

ఈ మాటలు విని బ్రాహ్మణుడు నిర్ఘాంతపోయి, "మా ఇంటికి నలుగురు రాజభటులు వచ్చినమాట వాస్తవం. జరిగిన దేమంటే, రాణిగారి రత్నం ఒకటి దేవాలయం ప్రాంతాల పడిపోయింది. అది పోయిందని తెలిసి వెతికే లోపుగా దాన్ని ఎవరో కాజేశారు. అందుచేత రాజభటులు అందరి ఇళ్ళకూ వచ్చి సోదా చేశారు. అలాగే మా ఇల్లుకూడా సోదా చేశారు. కాని

పోయిన నగ దొరకలేదు. దొంగ ఒకడు మా ఇంటి ముందుగానే వెళ్ళాడని నీవు చెబుతున్నావు గనక, పోయిన నగ తిరిగి సంపాదించి దొంగను రాజుగారికి పట్టి యిస్తివా, నీకు గొప్ప బహుమానం దొరుకు తుంది," అని జయదేవుడితో అన్నాడు.

జయదేవుడు బ్రాహ్మణుడితో మళ్ళీ వస్తానని చెప్పి, బయలుదేరి దారిమీదనే దృష్టి ఉంచి నడుస్తూ ఒక ఇంటిదాకా వెళ్ళాడు. అది ఒక కమసాలి ఇల్లు. జయదేవుడు లోపలికి వెళ్ళి, కమసాలితో బంగారం ధర గురించి, అతను చేసే కొత్త రకాల నగలను గురించి కాస్సేపు మాట్లాడి కలప్ప తినుతున్నాడు. తరవాత అతడు బ్రాహ్మడి వద్దకు తిరిగి వచ్చి, "దొంగను పట్టి ఇవ్వ గలను. రాజభటులను పిలిపించండి," అన్నాడు. బ్రాహ్మణుడు రాజభటులకు కబురు పంపి, జయదేవుడితో, "అయితే, నాయనా, ఇదంతా నీవు ఎలా కనుక్కో గలిగావు?" అని అడిగాడు.

"సైనికులలా, యుద్ధ విద్య నేర్చిన భటులలా నడిచేటప్పుడు వారి అంగలు ఒకే ప్రమాణంలో ఉంటాయి. వారు బారుతీరి నడుస్తారు. పాదాలు రెండూ ఒకే ఊతంతో వేస్తారు. అందుచేత అడుగు జాడలను బట్టి



నలుగురు మనుష్యులు మీ ఇంటికి వచ్చా రని, వారు సైనికులుగాని, భటులుగాని అయి ఉంటారని తేలికగా ఊహించాను. వారు మీ ఇల్లు దాటి ముందుకు పోవటం కూడా నాకు కనిపించింది," అన్నాడు జయదేవుడు.

"మరి దొంగజాడ ఎలా తెలిసింది?" అని బ్రాహ్మణుడు అడిగాడు.

"దొంగ నడివీధిన నడవడు, ఒక పక్కగా నడుస్తాడు. ఈ దొంగ నెత్తిన బొగ్గుల మూట ఉన్నది. వాడు అడుగు వేసి నప్పుడల్లా కొంచెంగా బొగ్గు నుసి రాలింది. వాడు బొగ్గులు తీసుకుని తిన్నగా నడిచి

పోక మధ్యమధ్య వెనక్కు తిరిగి చూసి నట్టుగా అడుగుల గుర్తులనుబట్టి తెలు స్తున్నది. తనను ఎవరన్నా వెంబడిస్తున్నా రేమో నని వాడు అలా చూసి ఉంటాడు. అందుచేత వాడేదో దొంగతనం చేసి ఉంటా డని ఊహించాను. అదిగాక రాజభటుల అడుగుల జాడలకన్న ఈ దొంగవి కొద్దిగా చెరిగి ఉన్నాయి. అందుచేత వాడు ఇటుగా వెళ్ళి ఒకటి రెండు ఘడియలు ఎక్కువ కాలమయింది. ఈ మధ్యలో ఇంకొక దొంగ తనమేమీ జరగలేదు గనక రాజభటులు వెతుకుతున్నది, ఈ దొంగ కోసమే అయి ఉండవచ్చు," అన్నాడు జయదేవుడు.

వాళ్ళు ఇలా మాట్లాడుతూండగానే రాజ భటులు వచ్చారు. జయదేవుడు వారిని కమసాలి ఇంటికి తీసుకుపోయాడు. ఆ ఇల్లు రాజభటులు అంతకుముందు సోదా చేసి వదే. అయితే వారు పెట్టెలూ బేడలూ మాత్రమే వెతికారు. కాని కమసాలులు ఏదన్నా దాచిపెట్టడానికి ఏదో ఒక కంతలో దూర్చిపెడతారు. ఈ సంగతి జయదేవుడికి తెలుసు. అందుచేత అతను రాజుగారు పోగొట్టుకున్న రత్నాన్ని కమసాలి ఇంటి లోని ఒక కంతలో నుంచి బయటికి తీశాడు. కమసాలి నేరం ఒప్పుకున్నాడు. రాజుగారి రత్నం కింద పడటం తాను చూసి, దాన్ని తీసుకున్నానని, ఎవరికీ సందేహం కలగకుండా ఉండగలందులకు ఒక బొగ్గుల మూట కొనుక్కుని, అందుకే గ్రామంలోకి వెళ్ళిన వాడిలాగా ఇంటికి వచ్చేశానని అతను చెప్పాడు.

రాజుగారు నగ దొరికినందుకు చాలా సంతోషించి, జయదేవుడికి మంచి బహు మానం ఇచ్చాడు. అతను దొంగను పట్టు కున్న విధమంతా బ్రాహ్మడు చెప్పినాక రాజు మరింత సంతోషించి, అన్ని విద్యలలోనూ ఆరితేరిన జయదేవుడికి మరిన్ని కానుకలు ఇచ్చి, తన కొలువులో ఉంచుకున్నాడు.






ఆ రాత్రి వారు ముగ్గురూ భరద్వాజుడు చెప్పిన కథలు అనేకం విని సుఖంగా నిద్ర పోయారు. మర్నాడు ఉదయం భరద్వాజుడు వారిని కొంతదూరం సాగనంపి, చిత్రకూటానికి తాను అనేక మార్లు వెళ్ళి వచ్చిన తోవ గుర్తులు చెప్పాడు. సీతారామలక్ష్మణులు ఆయన వద్ద సెలవు పుచ్చుకుని ఆయన చెప్పిన దారినే నడుస్తూ యమునా నదిని దాటవలసిన రేవు వద్దకు వచ్చారు. అక్కడ లక్ష్మణుడు కొయ్యలమీద ఎండిన వెదుళ్ళతో ఒక విశాలమైన తెప్ప తయారు చేశాడు. దానిపైన నేరేడు కొమ్మలతోనూ, పచ్చుల తీగలతోనూ ఒక సుఖమైన ఆసనం సీత కోసం అమర్చాడు. తెప్ప మీద తమ వస్తువుల నన్నిటినీ ఉంచి, తాము కూడా ఎక్కి నదిని దాటారు. ప్రవాహ మధ్యంలో సీత యమునా నదికి నమస్కరించి ఆవులూ, వెయ్యి కడవల కల్లూ ఇస్తానని, గంగకు మొక్కుకున్నట్టే మొక్కుకున్నది.

వసంతకాలం కావటంచేత అడవి చెట్లు పుష్పించి మహాశోభగా ఉన్నాయి. మోదుగు చెట్లనిండా ఎర్రటి పూలున్నాయి. సీత అప్పుడు ఆ వసంత శోభను చూసి ఆనందించటం ప్రారంభించింది. లక్ష్మణుడు ఆమె ముందు నడుస్తూ, ఆమె కోరిన ప్రతి పువ్వూ, ప్రతి పండూ కోసి తెచ్చి ఇస్తూ, ఆమె చెట్లను గురించి అడిగే ప్రశ్నలన్నిటికీ సమాధానాలిచ్చాడు. ఆ రోజు వారు మరి కొన్ని మృగాలను చంపి వాటి మాంసంతో ఆకలి తీర్చుకున్నారు.





ఆ రాత్రికి వారు ఒక పదునైన చోటు చూసుకుని అక్కడ నిద్రపోయారు.

తెల్లవారుతూనే రాముడు లేచి లక్ష్మణుణ్ణి లేపి చిత్రకూటానికి ప్రయాణం సాగించాడు. చిత్రకూట ప్రాంతంలో రాముడు ఒక స్థలం చూసి అక్కడ పర్ణశాల నిర్మించా మన్నాడు. లక్ష్మణుడు మంచి గుంజలు నరికితెచ్చి, వాటితో దృఢమైన పర్ణశాలా, దానికి అవసరమైన విభాగాలూ నిర్మించాడు. గృహదేవతకు బలి ఇవ్వటానికి అతను ఒక నల్ల ఇర్రిని పట్టి తెచ్చి, చంపి, దాన్ని ఖండించకుండానే అగ్నిలో కాల్చాడు. ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు శాస్త్రోక్తంగా గృహప్రవేశం చేసి, పక్కనే ప్రవహించే మాల్యవతి నదిలో స్నానాలుచేస్తూ, చుట్టూ ఉండే అందమైన అరణ్య ప్రాంతంలో విహరిస్తూ, పట్టణ జీవితాన్ని మరిచి సుఖంగా కాలం గడపసాగారు.

అక్కడ శృంగిబేరపురంలో గుహుడూ, సుమంత్రుడూ గంగ ఒడ్డున నిలబడి సీతా రామ లక్ష్మణులు కనుమాటు అయినదాకా చూసి గుహుడి ఇంటికి వెళ్ళిపోయారు. రాముడు మనసు మార్చుకుని తిరిగి వస్తాడేమోనని మూడు రోజులు చూసి సుమంత్రుడు ఖాళీ రథంతో అయోధ్యకు బయలుదేరి, రాముడు అయోధ్య విడిచి వెళ్ళిన అయిదు రోజులకు తిరిగివచ్చాడు.

దారిలో పౌరులు ఖాళీగా రథం తిరిగి రావటం చూసి ఎవరికి తోచినట్టు వారు మాట్లాడుకున్నారు. సుమంత్రుడు తిన్నగా కౌసల్య ఇంటికి వెళ్ళి, సింహాసనంపైన కూర్చుని ఉన్న దశరథుడితో రాముడు చెప్పి పంపిన మాటలు చెప్పేశాడు. దశరథుడు శోకోద్రేకంతో స్పృహతప్పి కింద పడిపోయాడు.

కౌసల్యా సుమిత్ర సహాయంతో దశరథుణ్ణి లేవదీస్తూ, "మహారాజా, రాముణ్ణి అరణ్యంలో దింపి వచ్చిన సుమంత్రుడికి





జవాబైనా చెప్పరేం? కైక ఏమన్నా అనుకుని పోతుందనా? ఆవిడగారికక్కర లేదుగా!" అని చెప్పింది. దశరథుడితో పాటు కౌసల్యా, ఇతర అంతఃపుర కాంతలూ రోదనాలు చేశారు.

"నా ఆజ్ఞకు ఎంత విలువ ఉన్నదో నాకు తెలియదు; నీవు మళ్ళీ వెళ్ళి రాముణ్ణి తీసుకురా! లేదా నన్ను ఆ రాముడి దగ్గిరకైనా తీసుకుపో," అన్నాడు దశరథుడు.

కౌసల్యకూడా సుమంత్రుడితో గర్భశోకంతో తనను రాముడున్న చోటికి తీసుకుపొమ్మన్నది. సుమంత్రుడు కౌసల్యను ఊరడిస్తూ, రామలక్ష్మణులు సులువుగా అరణ్యవాసవ్రతం పూర్తి చేయగలరనీ, ఆ సీతకు అది అరణ్యంలాగా ఉన్నట్టే లేదనీ, రాముడు లేని అయోధ్యే ఆమెకు అరణ్యమనిపించి ఉంటుందనీ అన్నాడు.

మర్నాడంతా కౌసల్య దశరథుణ్ణి దెప్పుడు మాటలతో బాధించింది. ఆ విధంగా తాను పడుతున్న బాధను కొంత బయట పెట్టుకున్నది. అసలే బాధ పడుతున్న తనను దెప్పుడు మాటలతో హింసించ వద్దని దశరథుడు చేతులు జోడించి కౌసల్యను వేడుకున్నాడు. కౌసల్య పుత్రశోకానికి తోడు పశ్చాత్తాపంతో కుమిలిపోయింది.



రాముడు వెళ్ళిపోయిన ఆరో రోజు రాత్రి, తన చావు కొన్ని ఘడియలలో ఉన్నదనగా దశరథుడికి తన చిన్ననాటి వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. ఇంకా కౌసల్యను పెళ్ళాడక పూర్వమే దశరథుడు పుత్రశోకంతో మరణించేటట్టు ఒక ముని వల్ల శాపం పొందాడు. అప్పుడాయన కౌసల్యకు ఆ సంఘటన గురించి చెప్పాడు:

ఆ రోజులలో దశరథుడు యువ్వనంలో ఉన్నాడు. ఆయనకు చప్పుడును బట్టి బాణం గురి చేసి కొట్టటంలో చాలా నేర్పుండేది. ఈ శబ్ద వేధిత్వాన్ని అందరూ మెచ్చుకునేవారు. అందుచేత యువరాజై





ఉన్న దశరథుడు తరుచు రాత్రివేళ సరయూ నది తీరానికి వెళ్ళి, అక్కడ వన్య మృగాలు నీరు తాగడానికి వచ్చే రేవు కనిపెట్టి సమీపంలో దాక్కొని, నీటి చప్పుడును బట్టి బాణం వేసి ఏనుగులనూ, సింహాలనూ, ఇతర మృగాలనూ వేటాడుతూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఒకసారి, వానకాలంలో రాత్రివేళ దశరథుడు గాఢాంధకారంలో మృగాల కోసం నదీతీరాన పొంచి చూస్తున్నాడు. ఆ సమయంలో నది నీటిలో బుడబుడ మని చప్పుడయింది. అడవి ఏనుగు అయి ఉంటుందనుకుని దశరథుడు చప్పుడుకు గురి చేసి తీవ్రమైన బాణం ఒకటి వదిలాడు.

మరుక్షణమే మనిషి ఆక్రోశం వినిపించింది. "అయ్యయ్యో, తపస్సు చేసుకునే మా బోటివాళ్ళ మీద ఈ బాణం పడటమేమిటి? నేను ఎవరికి అపకారం చేశాను? నన్ను చంపిన వాడికి ఏం లాభిస్తుంది? ఎవరో గాని, ఒక్క బాణంతో మూడు ప్రాణాలు తీశాడే! నేను పోతే, ముసలి వాళ్ళూ, గుడ్డి వాళ్ళూ అయిన నా తల్లిదండ్రులు ఎంతకాలం బతుకుతారు? ఎలా బతుకుతారు?" అన్న మాటలు దశరథుడి చెవులబడ్డాయి.

ఆయన దగ్గిరికి వెళ్ళి చూసేసరికి తన బాణం తగిలి ఒక ముని కుమారుడు కొలను ఒడ్డున బాధతో గిలగిల లాడిపోతున్నాడు. అతను నీటిలో ముంచిన పాత్ర పక్కనే పడి ఉంది.

మతిపోయి, చెయ్యీ కాలూ ఆడక నిలబడి ఉన్న దశరథుడితో ఆ ముని కుమారుడు, "ఎందుకు చేశావీ పాడు పని? నేనిక్కడ ఉన్నట్టు నా తండ్రికి నీవే వెళ్ళి చెప్పు. లేకపోతే ఆయనకు తెలిసే మార్గం లేదు. తెలిసినా ఆయన రాలేడు. దాహం జాస్తిగా ఉన్నదంటే నీరు తీసుకు పోదామని



వచ్చి నీ బాణం వాత పడ్డాను. ఈ బాధ భరించ లేను. ముందు ఈ బాణం లాగి మరీ వెళ్ళు," అన్నాడు.

కుర్రవాడు బాధపడి పోతున్నాడు, బాణం లాగేస్తే చస్తాడేమోనని దశరథుడు మొదట తటపటాయించినా, చివరకు ఆ కుర్రవాడి ప్రోద్బలం మీదనే బాణం లాగేశాడు. వెంటనే ముని కుమారుడు ప్రాణాలు వదిలాడు.

తరవాత దశరథుడు ఆ కుర్రవాడి పాత్రలో నీరు ముంచుకుని, అతడు చెప్పిన దారినే అతని తల్లి దండ్రులుండే కుటీరానికి వెళ్ళాడు.



దశరథుడి అడుగుల చప్పుడు విని తన కొడుకే ననుకుని ఆ కుటీరంలో ఉండే వృద్ధుడు, "నాయనా, ఎప్పుడో అనగా మంచినీటి కోసరం వెళ్ళిన వాడివి ఇంత ఆలస్యం చేశావేం? లోపలికి రా! త్వరగా నీరు ఇయ్యి!" అన్నాడు.

"నేను మీ అబ్బాయిని కాను, దశరథుణ్ణి, క్షత్రియుణ్ణి." అంటూ, తన బాణంతో దశరథుడు తాను చేసిన ఘోరం కాస్తా ఆ వృద్ధ దంపతులకు చెప్పేశాడు. వారి దుఃఖానికి అంతు లేదు. దశరథుడి సహాయంతో వారిద్దరూ తమ కొడుకు కళేబరం వద్దకు వెళ్ళి, దాని మీద పడి పెద్దపెట్టున ఏడ్చారు.

ముసలి ముని దశరథుడితో, "మా కున్న ఒక్క కొడుకునూ అకారణంగా చంపి మాకు తీరని పుత్రశోకం కలిగించావు గనక నీవు కూడా పుత్రశోకంతోనే మరణించా లని నిన్ను శపిస్తున్నాను," అన్నాడు.

తరవాత ఆ వృద్ధ దంపతులు తమ కొడుకు చితిలోనే కాలి చనిపోయారు.

ఎన్నడో జరిగిన ఈ సంఘటన దశరథుడికి ఇప్పుడు, తన ఆయువు తీరిపోయే దశలో, జ్ఞాపకం వచ్చింది. దానిని ఆయన కౌసల్యకు చెప్పాడు.







కౌసల్యతో మాట్లాడుతుండగానే దశరథుడికి చూపు మందగించింది. క్రమంగా శ్రవణశక్తికూడా పోయింది. బుద్ధి వికలమై పోసాగింది. ఆయన రాముణ్ణి కేకలు పెడుతూ, కైకేయిని తిడుతూ అర్ధరాత్రివేళ ప్రాణాలు వదిలాడు. అది రాముడు బయలుదేరి వెళ్ళిన ఆరో రోజు అర్ధరాత్రి. ఆ సమయానికి అంతఃపుర స్త్రీ లందరూ, కౌసల్యా సుమిత్రలు సహితం, నిద్ర పోతున్నారు.

రాజు మరణించిన సంగతి మర్నాడు తెల్లవారితేగాని అంతఃపుర కాంతలకు తెలియలేదు. అంతఃపురంలో శోకాలు సాగినాక పై వారికి జరిగిన సంగతి తెలిసింది.

త్వరలోనే వసిష్ఠుడు మొదలైనవారు వచ్చారు. దశరథుడికి అంత్యక్రియలు జరపటానికి ఆయన కొడుకులలో ఒక్కడైనా దగ్గర లేడు. రామలక్ష్మణులు అరణ్యానికి వెళ్ళారు. భరత శత్రుఘ్నులు భరతుడి మేనమామ అయిన కేకయరాజు ఇంట ఉన్నారు. అందుచేత దశరథుడి శరీరాన్ని తైలంలో ఉంచారు.

సిద్ధార్థుడు, విజయుడు, జయంతుడు, అశోకుడు, నందనుడు అనే వారిని పిలిచి వసిష్ఠుడు వారితో, "మీరు వేగంగల గుర్రాల పైన కేకయ రాజుండే రాజగృహానికి వెళ్ళండి. భరతుడితో ఇక్కడ ఒక ముఖ్య కార్యమున్నదని, మేము రమ్మన్నామని చెప్పండి. మీరు అతనితో రాముడు అడవికి వెళ్ళిన వృత్తాంతంగాని, రాజుగారు చనిపోయిన సంగతిగాని చెప్పనే వద్దు," అని చెప్పి, భరతుడికి మేలిమి వస్త్రాలూ, ఆభరణాలూ ఇచ్చి పంపాడు.

వాళ్ళు అనేక నదులూ, పర్వతాలూ దాటి, దీర్ఘ ప్రయాణం చేసి, భరతుడి మేనమామగారి దేశం చేరి, అతని మేనమామకూ, తాతగారికీ కానుకలుగా తెచ్చిన వస్త్రాభరణాలు భరతుడికి అందించి,

వసిష్ఠుడు చెప్పుమన్న మాటలు అదే విధంగా చెప్పారు.

భరతుడు పెద్దవాళ్ళ అనుమతి తీసుకుని, అయోధ్య నుంచి తన కోసం వచ్చిన వారి వెంబడి, పెద్ద బలగంతో సహా బయలు దేరాడు. మిగిలిన పరివారాన్ని నింపాదిగా వెనక రానిచ్చి, భరత శత్రుఘ్నులు రథంలో ముందుగా అయోధ్యా నగరం చేరుకున్నారు. వారు ఏడు రోజులు ప్రయాణించారు.

దూతలు అయోధ్య నుంచి వచ్చిన రాత్రే భరతుడికి ఒక పీడ కల వచ్చింది. అది వచ్చినప్పటి నుంచి అతని మనసులో ఏదో ఆందోళనగానే ఉన్నది. అయోధ్య ప్రవేశించగానే అతని ఆందోళన తిరిగి వచ్చింది. ఎందుకంటే నగరంలో సాధారణంగా ఉండే ఉత్సాహమూ, ఉల్లాసమూ లేవు. జనం నిరసించి నట్టున్నారు. నగరం పాడు పడినట్టున్నది.

భరతుడు ముందు తన తండ్రి నగరుకు వెళ్ళి అక్కడ ఆయన కనిపించక పోయేసరికి తన తల్లి ఇంటికి వచ్చాడు. కొడుకును చూస్తూనే కైకేయి ఆసనం మీదనుంచి లేచి, తన కాళ్ళకు నమస్కారం చేసిన భరతుణ్ణి తన చెంత కూచోబెట్టుకుని కుశల ప్రశ్నలు వేస్తూ, "నువు బయలుదేరి ఎన్నాళ్ళయింది, నాయనా? నీ మామా, తాతా క్షేమంగా ఉన్నారా? నీ కక్కడ సుఖంగా జరిగిందా?" అని ప్రశ్నించింది.

భరతుడు అన్నిటికీ సమాధాన మిచ్చి, "అమ్మా, నాన్నగారెక్కడ? పెద్దమ్మ కౌసల్య ఇంట ఉన్నారా? నే నాయన కాళ్ళకు మొక్కాలి!" అన్నాడు.

"ఆయన పెద్దల్లో కలిసిపోయాడు, నాయనా," అంటూ కైకేయి చావు కబురు చెప్పింది. ఈ మాట వినగానే భరతుడు కుప్పకూలి పోయాడు. కైకేయి అతన్ని ఊరడించ యత్నించింది.



# 5. తైమూర్ సమాధి

తైమూర్ (లేక టామర్లేన్) ప్రపంచయోధులలో ఒకడు. ఇతను ఇండియా, పర్షియా ఆసియా మైనర్‌లలోని అనేక ప్రాంతాలు జయించాడు. ఇతని రాజధాని సమర్‌కండ్. 1405 లో ఇతను చనిపోగా ఇక్కడనే అతన్ని సమాధి చేసి ఒక కట్టడం నిర్మించారు. ఈ కట్టడం పేరు గుర్ అమీర్. దీనిపై రంగు రంగుల పింగాణీ ఉన్నది.





# ప్రశ్నోత్తరాలు

1. బి. ప్రసాదరావు, కారిగనూరు

చంద్రగుప్తుడు క్రీ. పూ. 326లో రాజ్యము చేసి యుండవచ్చు నన్నారు. అతని కుమారుడు బిందుసారుడు క్రీ. పూ. 302లో రాజ్యము చేసి యుండ వచ్చు నన్నారు. వారిలో ఎవరు ముందు రాజ్యము చేసినది అర్థము కాలేదు.

క్రీస్తు పూర్వము నడిచిన సంవత్సరాల సంఖ్య వెనక్కు వెళ్ళిన కొద్దీ పెరుగుతుంది, ముందుకు వచ్చిన కొద్దీ తగ్గుతుంది. చంద్రగుప్తుడే ముందు రాజ్యం చేశాడు.

2. కుమారి వల్లూరి సీతాదేవి, ప్రత్తిపాడు

మా కథలు నీలో ప్రచురితం మయినచో ఆ నెల నీవు మా ఇంటికి ఊరికే వస్తావా?

కొంత దక్షిణతో సహాకూడా!

3. వి. రత్నకుమార్, పుంగనూరు

అన్నయ్యా, నిన్ను నేను కొంటాను, చదువుతాను, ఆనందిస్తాను, కాని నీవు నా స్నేహితుల వద్దకు పోతే నాకు దక్కనే దక్కవు. ఇందుకు కారణం నువ్వా? నా స్నేహితులా?

ఎవరూ కాదు, నువ్వే!

4. జి. మురళీధర్ రావు, హైదరాబాదు

మొన్న మా కన్నడ మిత్రుడొకాయన "చందమామ"ను గురించి తెగ పొగడి, కొద్ది రోజుల్లో చాల అభివృద్ధి సాధించిందన్నారు. మరి మీ అభిప్రాయమేమిటి?

కొద్ది రోజులంటే ఆయన ఉద్దేశం 14, 15 ఏళ్ళని అయి ఉంటుంది. "చందమామ" ప్రారంభించినప్పటి నుంచి ఈ నాటి దాకా అభివృద్ధి చెందుతూనే ఉన్నది. పాఠకుల అభిమానం ఉన్నంతకాలమూ ఈ అభివృద్ధి నిలిచిపోదు.

5. "భాస్కరశ్రీ", అనకాపల్లి

ఉత్పల సత్యనారాయణాచార్యగారి గేయ రచనలు వేరు పుస్తకాలుగా అచ్చయితే చాలా బాగుంటుందండి.

"ఉత్పలమాల" అనే పేరుతో శ్రీ సత్యనారాయణాచార్యగారి "గంగావతరణం", "క్షీరసాగరమథనం", "శమంతకమణి" అనే మూడు గేయ కథలు బొమ్మలతో సహా అచ్చవుతున్నాయి. త్వరలోనే అవి మీకు దొరుకుతాయి.

6. సయ్యద్ నజీముద్దీన్, అమలాపురం

ప్రశ్నలు "చందమామ"కు సంబంధించినంత వరకే పరిమితం చెయ్యటంలో మీ ఉద్దేశం? బాలల విజ్ఞానానికి సరిపడే ఇతర ప్రశ్నలు అడగకూడదని మీ అభిప్రాయమా?

ఎంత మాత్రమూ కాదు. తెలుగు పాఠకులు హెచ్చుగా "చందమామ"లో తాము చదివే విషయాలను గురించే ప్రశ్నలు వేస్తున్నారు. కన్నడ పాఠకులు వైజ్ఞానిక విషయాలను గురించి హెచ్చుగా ప్రశ్నలు వేసి వైజ్ఞానిక విషయాలు తెలుసుకుంటున్నారు. తెలుగు పాఠకులు అలాటి ప్రశ్నలు వేస్తే మా కేమీ అభ్యంతరం లేదు.

7. బి. ఈశ్వరనాథ్, విజయవాడ

రాహు కేతువులంటే ఖగోళశాస్త్ర రీత్యా ఏమిటవి? సూర్య కుటుంబము లోనివేనా?

భూమి, చంద్రుడూ అస్తమానమూ సూర్యకాంతిలోనే ఉంటున్నాయి. అందుచేత వాటి వెంట వాటి నీడలుకూడా ఆకాశంలో ఉంటున్నాయి. ఈ నీడలే రాహు కేతువులు. వీటిని ఛాయాగ్రహా లంటారు. భూమియొక్క నీడ చంద్రుడిపై పడితే చంద్ర గ్రహణం. చంద్రుడి నీడ భూమిపై పడితే సూర్యగ్రహణం.

8. ఎం. ఆర్. వాసుదేవ, బెంగుళూరు

అయ్యా, మనం తెలుగు "చందమామ"లోని పార్వతీ కల్యాణమున్నూ, కన్నడములోని పార్వతీ పరిణయమున్నూ చదువుతాము. తెలుగులోని రసపాకం కన్నడములో అట్లానే ఉన్నది. కాని తెలుగు మహాకవిగారి పేరు కన్నడంలో లేదు. ద్రోహముకాదా?

కాదు. కవిత్వం అనేది తర్జుమా చేసేదికాదు. ఏ భాషకు ఆ భాషలో కవితాధార సృష్టి కావలసినదే. అందుచేత కన్నడ చందమామలో కన్నడ కవిగారి పేరు వేస్తున్నాము.

Photo by K. M. Panjabi



బహుమతి
పొందిన వ్యాఖ్య

పదిలముగా ఖైది నైతి

పంపినవారు:
టి. జి. కె. గుప్త, మద్రాసు-1

# క్షణిక వైరాగ్యం ★ [రామతీర్థ కథ]

ఒకనాడు మిట్ట మధ్యాహ్నం వేళ ఒక ముసలివాడు పెద్ద కట్టెల మోపును మోసుకు వస్తున్నాడు. అసలే ముసలివాడు బలహీనుడు, ఎండ మండి పోతున్నది. నెత్తిమీది బరువు భారంగా ఉన్నది. వాడొక చెట్టు నీడ చేరి, మోపు కింద పడేసి, చతికిల బడి ఆయాస పడుతూ, "ఓ మృత్యుదేవతా! నీవైనా రారాదా?" అని ఆక్రోశించాడు.

వెంటనే యమధర్మరాజు వాడి ఎదట ప్రత్యక్షమయాడు. యమధర్మ రాజు ఆకారం చూడగానే ముసలి వాడికి దడ పుట్టుకు వచ్చింది. ప్రాణ భీతి కలిగింది. వాడు తన ఎదట ప్రత్యక్షమైన ఆకారంతో, "ఎవరు, బాబూ, మీరూ?" అన్నాడు.

"నన్ను పిలిచావుగద, అందుకని వచ్చాను. నేను మృత్యుదేవతను. నీవు చచ్చిపోవాలని ఉంటే నిన్ను తీసుకు పోతాను," అన్నాడు యముడు.

"అయ్యో, బాబూ! నన్ను తీసుకు పొమ్మని కాదు నేను నిన్ను పిలిచినది. ఇక్కడ ఎవరూ కనిపించలేదు. ఈ కట్టెల మోపు ఎత్తుకోవటానికి సహాయం చేస్తావేమో నని పిలిచాను," అన్నాడు ముసలివాడు యముడితో.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిపడిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఉదరము నింపగ వేడితి

రెండవ ఫోటో: పదిలముగా ఖైది నైతి

పంపినవారు: బి. గోపాలకృష్ణ గుప్త,

నెం. 25, వరద ముత్తియప్పన్ స్ట్రీట్, మద్రాసు-1.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

యుద్ధం జరుగుతూ ఉండినంత కాలమూ సంజయుడు ధృతరాష్ట్రుడికి యుద్ధ విశేషాలు తెలుపుతూ వచ్చాడు. తన నూరుగురు కొడుకులూ చచ్చిపోయారని వినగానే ధృతరాష్ట్రుడు శోకవివశుడై స్పృహ తప్పి పడిపోయాడు. సంజయుడు ఆయనను లేపుతూ, "నీ కొడుకులేనా? పద్దెనిమిది అక్షౌహిణుల సేనతో సహా ప్రపంచంలో ఉన్న యోధులందరూ నాశనమయారు. అందరికీ ప్రేత కార్యాలు చేయాలి," అని చెప్పాడు.

విదురుడుకూడా ధృతరాష్ట్రుణ్ణి ఊరడిస్తూ, సంసారం ఎటువంటిదో తెలపటానికి ఒక ఉపమానం చెప్పాడు. ఒక బ్రాహ్మణుడు ఒక కారడవిలో ప్రవేశించాడు. అందులో భయంకరమైన జంతువులన్నీ బీభత్సంగా అరుస్తున్నాయి. ఒక రాక్షస స్త్రీ అతని వెంటపడింది. ఆమెను తప్పించుకుని అతను దారిలేని ఆ వనంలో పడిపోతూ ఒక నూతిలో పడ్డాడు. దాని పైన తీగలు అల్లుకుని ఉండటంచేత అది అతనికి కనిపించ లేదు. ఆ తీగలకు కాళ్ళు తగులుకుని అతను సాంతం పడిపోకుండా తల కిందులుగా వేళ్ళాడాడు. ఆ స్థితిలో అతనికి మరికొన్ని ప్రమాదాలు ఎదురయాయి. బావిలో ఒక మహా సర్పం ఉన్నది. బావి పై భాగంలో ఒక బ్రహ్మాండమైన ఏనుగు కనిపించింది. బావి పైన ఉండే ఒక చెట్టునిండా తేనె పట్లూ, వాటి నిండా పోతుల్లాటి తేనెటీగలూ ఉన్నాయి. ఆ తేనె పట్టుల నుంచి తేనె బొట్లు బొట్లుగా కారుతుంటే ఆ బ్రాహ్మణుడు వాటిని ఆత్రంగా తాగసాగాడు. ఎంత తాగినా అతనికి ఇంకా తాగాలన్న ఆశే తప్ప జీవితం మీద విముఖత్వం ఎంత మాత్రమూ లేదు!

విదురుడీ ఉపమానం చెప్పి, "రాజా, మనిషియొక్క లౌకికమైన కోరికలు ఇదే విధంగా ఉంటాయి," అంటూ తత్వబోధ చేశాడు. కాని ఈ వేదాంతంతో కూడా ధృతరాష్ట్రుడికి పుత్రశోకం తగ్గలేదు. అప్పుడు వ్యాస మహాముని వచ్చి ఇలా చెప్పాడు:

"ఒకప్పుడు నేను ఇంద్రసభకు వెళ్ళాను. అప్పుడే భూదేవికూడా వచ్చి దేవతలతో తన భారం తగ్గించమని మొరపెట్టుకున్నది. అప్పుడు విష్ణుమూర్తి ఆమెతో, నీ కడుపున దుర్యోధనుడు కలి అంశతో జన్మించి భూభారం తీర్చగలడని చెప్పాడు. పాండవులు నీకు ద్రోహం చేశారని వారిపై పగ పెట్టుకోకు, నీ వంటి పాండవులకు చాలా ఇష్టం."

ఈ మాటలతో కొంత ఊరట పొంది ధృతరాష్ట్రుడు గాంధారిని, కుంతిని ఇతర అంతఃపుర స్త్రీలనూ వెంట బెట్టుకుని యుద్ధరంగానికి బయలుదేరాడు.

దారిలో ధృతరాష్ట్రుడికి కృప కృతవర్మాశ్వత్థామలు ఎదురయారు. వారు గాంధారీ ధృతరాష్ట్రులతో తాము మాత్రమే యుద్ధంలో చావక మిగిలామని, గడచిన రాత్రి ద్రుపదుడి కొడుకులనూ, ద్రౌపది కొడుకులనూ హతమార్చామని చెప్పి, పాండవులకు చిక్కకుండా పారిపోతున్నామని సెలవు పుచ్చుకున్నారు. తరవాత వారు చీలిపోయారు. కృపుడు హస్తినాపురానికి వెళ్ళాడు, కృతవర్మ తన భోజ దేశానికి వెళ్ళిపోయాడు, అశ్వత్థామ వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడే అతను పాండవులకు దొరికిపోయాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## రాగిణి సౌందర్య రహస్యం...

## 'మనోహర చర్మసౌందర్యమునకు అనువైనది లక్స్'




**'నాకు నచ్చిన సబ్బుకు, మెచ్చిన రంగులు!'**

అన్నది ప్రఖ్యాతమైన సినిమాతార రాగిణి.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్.

LTS.112-X29 TL



ధూతపాపేశ్వర్

# బ్రాహ్మీ ఆమలా

కేశవర్ధక్ తైలం





ధూతపాపేశ్వర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ పన్వెల్-బొంబాయి

పాప్యులర్

# కేమెల్ ఇంక్

ప్రతివారికి ప్రసిద్ధయినది



కేమిలిన్ ప్రైవేట్ లి., బొంబాయి-16






పోయిన సంవత్సరం
నా హెర్క్యులిస్
సైకిలుకు చేసింది ఒక్క
ఓవర్‌హాలింగ్ మాత్రమే

— అంటున్నారు మహమ్మద్ ఇస్మాయిల్

ఇందుకోసం అతను మూడు రూపాయలకంటె ఎక్కువ ఖర్చు పెట్టలేదు.

ఈ రోజుల్లో తయారవుతున్న సైకిళ్లలో హెర్క్యులిస్ అత్యుత్తమమైనది. ఇండియాలోనే చాలా పెద్దదీ, అన్ని హంగులూ కలిగిన కర్మాగారంలో ఇది తయారుచేయ బడుతోంది. ఇందులోని ప్రతి భాగమూ అద్భుతంగాను నిర్దిష్టంగానూ వుంటుంది. అందువల్ల కొంచెం జాగ్రత్త తోనే హెర్క్యులిస్‌ను చాలాకాలం వాడుకోవచ్చును.

# హెర్క్యులిస్

ఇది వట్టి సైకిలు కాదు
జీవితకాలపు నేస్తం



నిర్మాతలు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు — మద్రాసు

JWT/TIC/H 1584a

విజయా వారి

# గుండమ్మ కథ

మహోజ్వల సాంఘిక చిత్రము

కథ... చక్రపాణి

మాటలు..డి.నరసరాజు ...పాటలు..పింగళి నాగేంద్రరావు
సంగీతం..ఘంటసాల ...ఫొటోగ్రఫీ..మార్కస్ బార్ట్లే
కళ...గోఖలే.కళాధర్

డైరెక్షన్..కె.కామేశ్వరరావు.బి.ఎ.
నిర్మాతలు
నాగిరెడ్డి... ...చక్రపాణి



